**MAHARAJAH**
of
JEYPORE.

FORT
**JEYPORE**
(ORISSA)

జయపురం
౨౦-౧౦-౪౬.

# ఆశయము

శ్రీ వంగూరి నరసింహారావు పంతులుగారు నిజ విరచితమగు "మహాభక్తులు" యొక్క తృతీయ ముద్రణ ప్రతిని ప్రేమపూర్వకముగ నాకుం బంచిరి.

అది మృదుపద సంకలితమును, రామదాస, త్యాగరాజులను ప్రసిద్ధ మహాత్మద్వయ పవిత్ర చరిత విరాజితమును, బండిత ప్రకాండాశయ యుతమునై యొప్పుచుం బాలక ప్రకరమునకు సుబోధకమయి భక్తిని గలిగించెడిని.

ఇట్లు
శ్రీ విక్రమదేవవర్మ.
(శ్రీ జయపురం మహారాజావారు)

## ఆంధ్రపత్రిక

(శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణగారు, బి. ఏ., బి. ఎల్.,)

* * * * గ్రంథకర్త పవిత్ర హృదయముపై సహృదయులు పూలు చల్లకమానరు.

* * * గ్రంథకర్తగారు * * * తమ రచనమును రసభరితము గావించిరి. చక్కని గేయములకును, పద్యములకును, గ్రంథ రంగస్థలి చోటొసగి రాగ్దరగించు విమల గాంధర్వమును వినుపించిరి. మనసు నలరించు మాటలను తమ రచనమున నందందు జొనిపిరి.

* * *

గ్రంథకర్తగారు తమ కర్తవ్యమును చక్కగ నిర్వహించిరి. ఇట్టి పవిత్రగ్రంథములను విశేషముగ రచించి * * ఆంధ్రుల ధన్యవాదముల నందెదరు గాక !

## కృష్ణాపత్రిక

* * * భక్త్యావేశముచే హృదయమును ద్రవింప జేసే రచన! చిట్టచివరవఱకు పుస్తకము వదలిపెట్ట బుద్ధి పొడమదు.



## శ్రీ వడ్డాది సుబ్బారాయుడుగారు

రామదాసు - త్యాగరాజుల చరిత్రములు రెండు కర్ణామృతములుగా మీరు వర్ణించి నందులకు మిక్కిలి ఆనందించితిని. * * * చదివించి విన్నప్పుడు ప్రతి వాక్యమునకును నాకన్నులనుండి ఆనందబాష్పములు ధారగా వర్షించినవని చెప్పుటకంటె తద్గ్రంథ పాశస్త్యము వేరుగా చెప్పనక్కరలేదని నా అభిప్రాయము.

## శ్రీ కూచి నరసింహముగారు

గ్రంథము వెంటనే చదివి ఆనందించితిని * * భక్తి భరితమైన హృదయముతో చక్కని శైలిని రచించిన * * మీ రెంతయు ధన్యులు ! * * * ఇట్టి మంచిగ్రంథములు మఱికొన్ని వ్రాయుటకు గావలయు ప్రజాప్రోత్సాహ సమాదరణములను బడయుటకు మీరర్హులు !

## శ్రీరాజా మంత్రిప్రగడ భుజంగరావు

### బహదూరు జమీందారుగారు

* * * * శైలి కడు మృదుమధురముగ నున్నది. సమయోచిత లలితపద భూయిష్ఠమై, నిర్దుష్టముగను, సరళముగను ఉన్నది. మీవచన రచనా సామర్థ్యముచే మహాభక్తుల చరితములకు మెరుగుపెట్ట గలిగితిరని నావిశ్వాసము !

## HINDU.

The main incidents are chronicled as much with reference to tradition as with reference to known historical facts * * The wide cotholicity of their out look is *well brought out* though they were intence Bhaktas of Rama.

Mr. Narasimha Rao *writes a fluent, chaste, Grandhic style.*

## శ్రీ ఉమర్ ఆలీషా కవిగారు

"భాష నిర్దుష్టమును తెల్గుపల్కులందు
ఆధునికశయ్య ధ్వనియును సానుభూతి
గలుగు శైలిని వ్రాసిన కవితబోలె
వ్రాసె వంగూరి నరసింహరాయసూరి."

## శ్రీ భోగరాజు నారాయణమూర్తి
## అడిదం రామారావుగార్లు

విజయనగరం మహారాజావారి కాలేజీ

హైస్కూలు ప్రధాన పండితులు.

* * * మృదుమధుర పదజాలముతో పండిత పామర సమ్మతమగు చక్కని శైలిలో మిక్కిలి రమ్యముగా రచింపబడినది * * * ఈ గ్రంథము సర్వజన సమాదరణీయమగు నను టకు సందియము లేదు.

# విజ్ఞాపనము.

ఈ గ్రంథములో శ్రీరామదాసు - త్యాగరాజుల పవిత్ర చరిత్రములు సంగ్రహముగ వివరింపఁబడినవి. వీనిని వ్రాయుటకు నాకు వారియెడఁగల భక్తివిశ్వాసములును, గౌరవప్రేమలే కారణములు.

రామదాసు పదునేడవ శతాబ్దమువాఁడు. త్యాగరాజు పందొమ్మిదవ శతాబ్దమువాఁడు. ఇరువురును శ్రీరామచంద్రభక్తులే! ఇరువురును ఆంధ్రులే! ఇరువురును తారక మంత్రోపదేశమును బొందినవారే! అట్లయ్యును, రామదాసు కేవలము మహాభక్తుడే! త్యాగరాజు మహాభక్తుఁడే గాక, గాయకబ్రహ్మయై, సంగీత శాస్త్రోద్ధారకుఁడై మహాకవియై కీర్తిఁగాంచెను.

ఆంధ్రదేశమునందు రామదాసు కీర్తనలును, త్యాగరాజు కృతులును, భక్తిని మతమును సులభముగ బోధించి మనజాతిని రక్షించుచున్నవి. రామదాసు కీర్తనలెక్కువగ పామరజనులును— త్యాగయ్య కృతులెక్కువగ పండితులును విని ధన్యులగుచున్నారు.

నే నీ గ్రంథము వ్రాయుటలో ననేక గ్రంథములును, గ్రంథపీఠికలును సాయపడినవి. అందు ముఖ్యముగ శ్రీ వింజమూరి వరహా నరసింహాచార్యులుగారి "శ్రీ త్యాగరాజు చరిత్ర" యును, శ్రీ తిరుకడియూరి కృష్ణదాసుగారి "రామదాసు చరిత్ర" యును, నాకు సాయపడినవి.

ఈ మహాభక్తుల సంగ్రహచారిత్రములు పాఠకుల చిత్తముల నొక్కఁ క్షణమైన భక్తి, జ్ఞాన, గాన, వైరాగ్యభావములతో లగ్నమొనర్పఁగలిగినచో నా యీ ప్రయత్నము వృథగాలేదని భావించెదను.

ఆంధ్రసోదర సోదరీమణులు, అన్యభాషీయులు కూడ నర్థము తెలియక పోయినను అత్యంతాదరముతోఁ బాడుకొని యానందించు శ్రీ త్యాగరాజస్వామి

కృతులనింకను బాహుళ్యముగ బ్రతియింటను గానము చేసికొని యానంద తరంగితాత్ములై, శ్రీరామదాసుగారి రామ సంకీర్తనములఁ బాడుకొనుచు శ్రీ రామ కైంకర్యతత్పరులై - రామభక్తులై తరింతురని విశ్వసించుచున్నాను.

నరసాపురం,
ఈశ్వరసంవత్సర
మార్గశీర్ష శుద్ధ విదియా
భానువారము.

ఇట్లు,
భక్త విధేయుఁడు
వంగూరి నరసింహారావు.

# కృతజ్ఞత

శ్రీరామచంద్ర కరుణాకటాక్షమున నే రచించిన యీ "మహాభక్తులు" అను పుస్తక మిప్పటికి పంచమ ముద్రణ మైనది. ఆంధ్రవిద్వల్లోకమును, విద్యాశాఖాధికారులును, ఈ పుస్తకమును విశేషముగ నాదరించి, పోషించినందులకును, మద్రాసు సెకండరీ ఎడ్యుకేషనల్ బోర్డువారు 1950 ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్ష కీపుస్తకము పఠనీయ మొనర్చినందులకును నాకృతజ్ఞతానేక వందనములు!

నరసాపురము
సర్వధారి సం॥ర
ఫాల్గుణ శు ౫ మీ
శుక్రవారము.

ఇట్లు
వంగూరి నరసింహారావు
వ్యవస్థాపకుడు
"కమలకుటీర్"
"కమలకుటీర్ ప్రెస్"

శ్రీ

శ్రీరామచంద్ర కరుణా

కటాక్షమున

నే రచించిన

ఈ 'మహాభక్తు' లను పొత్తమును

నా జననీజనకులగు

సంగూరి శేషగిరాంబా, సుబ్బారావుగార్లకు

ప్రేమపూర్వకముగ

సంకితమొనర్చుచున్నాను.

శ్రీరామచంద్ర.

# శ్రీ రా మ దా సు

శ్రీమంతంబును, సమస్తసస్యఫలభరితంబును, పవిత్ర జీవనదీనదసేవితంబును, రత్నగర్భయు, ననేకమహాపురుషజన్మస్థానంబునగు భరతవర్షంబున హిమగిరి మొదలు కన్యాకుమారి వఱకు ననేకపుణ్యక్షేత్రములు గలవు. అందుఁ బవిత్రమగు గోదావరీనదీతీరమునఁగల శ్రీభద్రాచలక్షేత్ర మొకటి. ఈ భద్రాచలక్షేత్రమహిమననుసరించి యొక యితిహాసముగలదు.

పూర్వము మేరువు తనసతీమణియగు మేరుదేవితోఁ గలసి బ్రహ్మదేవునిగూర్చి విశేషతపము నొనరించెను. అంతట విరించి ప్రత్యక్షమై మీకేమి కోరిక గలదో కోరుకొనుఁడనగా నా దంపతులు భక్తుఁడగు కుమారుని బ్రసాదించుమని కోరిరి. కొంతకాలమునకా విరించికటాక్షమువలన వారికి భద్రుఁడను పుత్రుఁ డుదయించెను.

ఇది యిట్లుండ శ్రీరామచంద్రుఁడు సీతాలక్ష్మణసహితుఁడై దండకారణ్యమున విహరించుచుఁ గొండొకవడికి మిగుల నలసి యొకపర్వతముపై నాసీనుఁడై విశ్రాంతిఁ గైకొనెను. పిదప నాతఁ డాశైలముం గాంచి 'నీ యాతిథ్యమునకు మెచ్చి నీపై సుఖాసీనుఁడనై విశ్రాంతిఁగైకొని యానందించితిని. నీవు శీఘ్రకాలంబులో మేరువునకుఁ బుత్రుండవై జన్మించి నాముఖ్యభక్తులలో నొకండ వగుదువు.' అని దీవించెను.

# 1. జననము

"శ్లో. దిగంబరం కింకిణీమేఖలోజ్జ్వలం
లలాటపర్యంతవిలంబి తాలకం
కలద్వచస్కం కమనీయనూపుర
ద్వయం శిశుం రామ మహం నమామి."

పూర్వము గోల్కొండ రాజ్యములోఁ జేరిన 'నేలకొండపల్లె' యనుగ్రామమునఁ బదునేడవశతాబ్దిమధ్యమునఁ 'గంచెర్ల లింగన్నమంత్రి' యను నియోగిబ్రాహ్మణుఁ డుండెను. అతని భార్య యప్పటి గోల్కొండసంస్థానపు మంత్రులగు నక్కన్న మాదన్నగార్ల సోదరియగు 'కామాంబ' యను మహాసాధ్వి. లింగన్నమంత్రి మహాధనవంతుఁడు కాకపోయినను తాను సుఖముగఁ దిని యొరుల కింత పెట్టుటకుఁ దగిన సిరిసంపదలు గల సంసారి. ఆయుత్తమగృహస్థుఁడు గొప్పవిష్ణుభక్తుఁడు. ఆ యూరిలో నాతఁడే పెద్ద. అతిథ్యభ్యాగతుల సేవించుచు, బీదసాదల నాదరించుచు, దానధర్మములు చేసికొనుచు, దైవభక్తితత్పరుఁడై సహధర్మచారిణియగు కామాంబతో లింగన్న మంత్రి సుఖముగఁ గాలక్షేప మొనర్చుచుండెను.

లింగన్నమంత్రికి ధనధాన్యములకుగాని, పాడిపంటలకుగాని, భూవసతికిగాని, యెట్టిలోటును లేదు. కాని సంతానము మాత్రము లేక నాదంపతులు విచారించుచుండిరి. సంతానము

కొంత కాలదంపతు లనేకవ్రతము లాచరించిరి. అనేక తీర్థయాత్రలు చేసి యా యా దేవతల నారాధించిరి. కాని ఫలము కలుగలేదు. తుద కొకనాఁ డొక యోగిపుంగవుఁడు వారింటికి కరుణించి వారికి సంతానమును ప్రసాదించు మంత్రరాజము నొకదాని నుపదేశించి చనెను. ఆమంత్రము నాదంపతులు నియమముఁ దప్పకుండ పునశ్చరణఁ జేయసాగిరి. ఆ మంత్రమహిమ వలన సాధ్వీమణియగు కామాంబ యనతి కాలముననే యొక సుపుత్రునిఁ గనెను. ఆ వార్త వినినంతనే లింగన్నమంత్రి బ్రహ్మానందభరితుఁ డయ్యెను. కొన్ని దినముల నాతఁడు మహా వైభవముగఁ బుత్రోత్సవముఁ జేసెను. అతని బంధువులు, స్నేహితులు మొదలగువారనేకు లాశుభకార్యమునకు వచ్చిరి. లింగన్నమంత్రి తనకుమారునకు 'గోపన్న' యని నామకరణ మొనర్చెను. శుభకార్యము నిర్విఘ్నముగను, జయప్రదముగను జరిగిపోయెను. కాని యాశుభకార్యమున కేపని తొందరల వలననో లింగన్నమంత్రి బావమరుదులగు అక్కన్న మాదన్న గార్లు వచ్చియుండలేదు. అందుచే నాదంపతులకుఁ గొంచెము లోపముగనే కన్పించెను. 'గొప్పవారు మనయిండ్లకు వత్తురా' యని లింగన్నమంత్రి కామాంబతో ననెను.

గోపన్న బాలచంద్రునివలె దినదినప్రవర్ధమానుఁడగుచు తల్లిదండ్రులకన్నుల వెలుఁగుగా - గారాబుపట్టిగాఁ బెరుగుచుండెను. తల్లిదండ్రులు నాచిట్టిబాలునితోడిదే లోకముగా నహర్నిశము లాపాపనితో నాడుకొనుచు, నానందించుచు,

ముద్దులాడుచు నతిగారాబముగఁ బెంచుకొనుచుండిరి. వారు విష్ణుభక్తు లగుటచే జోలలు పాడునప్పుడుగాని, యాట లాడించునప్పుడుగాని విష్ణునామకీర్తనములే పాడుచుండిరి. మాటలు నేర్పునప్పుడుకూడ 'రామయ్యా మముఁ గాచి రక్షించుమయ్యా! గోపన్న సిన్నిపుడు గొలుచువాఁ డయ్యా' యని నేర్పుచుండు వారు. క్రమక్రమముగ గోపన్నకూడ భక్తులగు తల్లిదండ్రుల కడుపునఁ బుట్టుటచేతనో - శైశవమునుండియు విష్ణునామసంకీర్తనములో మునిఁగి తేలుటచేతనో - పూర్వజన్మపుణ్యఫలము ననో కాని బాలభక్తుఁ డయ్యెను. అతఁ డెప్పుడును—

"రామం రామం రామం శ్రీరఘురామం రామం రామం ॥రా॥
నరహరి దేవ జనార్దన కేశవ నారాయణ కనకాంబరధారీ ॥రా॥
నందనందనా నందముకుందా బృందావన గోబృందవిహారీ ॥రా॥

యని చిన్నచిన్న కీర్తనలు పాడుచు నాడుచుండెడివాఁడు.

ఐదేండ్ల ప్రాయమున లింగన్నమంత్రి గోపన్న కక్షరాభ్యాసమును చేయించి, యొకసద్గురువుకడ విద్యాభ్యాసమునకై యప్పఁజెప్పెను. గోపన్న యనతికాలములోనే వర్ణమాలను నేర్చికొని, చదువుట వ్రాయుట, యలవఱచుకొని బాలరామాయణమును దినమునకు మూఁడుమార్లు చదువుచుఁ దల్లిదండ్రులను, గురువులను దనుపుచుండెను. అంతియేగాక సర్వవిషయములను దెలిసికొనుచు తన యసాధారణ ప్రజ్ఞావిశేషముచే నెట్టిప్రశ్నల కైనను జక్కఁగ వెంటనే సమాధానముల నొసఁగుచు నందరి చేతను గోపన్న గొప్పమేధావి యగు ననిపించుకొనుచుండెను.

తల్లిదండ్రులు రామాయణప్రసంగ మెప్పుడొనర్చినను గోపన్న "తల్లీ! నేను రామాయణకాలమునాటికి జన్మించి యున్నచో నా శ్రీరామచంద్రునికి ముఖ్యపాదసేవకుఁడనై యుండెడి వాడనుకదా? అడవులలో వారు సంచరించునపుడు తాటకాదిరాక్షసులను నేనే చంపి వారికి శ్రమ లేకుండఁ జేసియుందునుకదా! హనుమంతునికంటె ముందు నేనే లంకకుఁ బోయి సీతాదేవినిచూచివచ్చియుందునుకదా! సీతారాములను నాభుజములపై నెక్కించుకొని చిటికెలో నయోధ్యఁ జేరియుందును కదా! నిత్యమును రామపాదసాన్నిధ్యమునఁ గూరుచుండి, రామచరణసేవఁ జేయుచు—

"చరణములే నమ్మితి రామా నీదివ్య ॥చ॥
వనమున రాతిని వనితగఁ జేసిన
చరణము - చరణము - చరణము - నీదివ్య ॥చ॥

అని పాడుకొనుచు మహానందభరితుఁడనై కాలము గడపియుందునుకదా! నా కట్టి యదృష్టము లేకపోయినది. అనుకొనుచుండువాఁడు. తల్లిదండ్రు లా గోపన్నను జూచి, యతని భక్తిపారవశ్యత కచ్చెరువొంది 'నాయనా! నిజముగా నీవప్పుడు కూడ నుండియుందువు. రామ భక్తులలో ముఖ్యుఁడవై యుందువు. లేనిచో నీ కింత భక్తి యెట్లుండును నాయనా' యని బుజ్జగించుచుండువారు.

# 2. గురూపదేశము

"శ్లో. జయతు జయతు మంత్రం జన్మసాఫల్యమంత్రం
జననమరణ భేదక్లేశవిచ్ఛేదమంత్రం
సకలనిగమమంత్రం, సర్వశాస్త్రైకమంత్రం
రఘుపతినిజమంత్రం, రామరామేతిమంత్రమ్."

లింగన్నమంత్రి గోపన్న కేడవయేట మహావైభవముగ నుపనయనమహోత్సవమును జేసెను. గోపన్న క్రమముగ నాంధ్రగీర్వాణభాషలయం దసమానపాండిత్యమును గడించెను. శ్రీమద్రామాయణ, భారత భాగవతాద్యద్గ్రంథములు జదివి చక్కగ నర్థముఁజెప్పుచు పురాణకాలక్షేపముఁ జేయుచుండెను! పదునారేండ్ల ప్రాయము వచ్చుసరి కాతఁడు లౌకికజ్ఞానమును గూడగడించి, తండ్రికి సహాయముగ గృహకృత్యములను, స్వంత వ్యవహారములను జక్కఁబెట్ట సాగెను. గ్రామస్థులు లింగన్న మంత్రిగారిట్టి కుమారరత్నమును బడసినందులకు సంతసించు చుండిరి. లింగన్నమంత్రియును క్రమక్రమముగ వ్యవహార మంత యును గోపన్నకే వప్పఁజెప్పి తాను విశ్రాంతిఁ గైకొనసాగెను.

యుక్తకాలమున లింగన్నమంత్రి గోపన్నకు సామాన్య కుటుంబీకుల బిడ్డయైనను అనుకూలవతియు, చక్కనిచుక్కయు, సాంప్రదాయవంశమునకుఁ జెందినదియు, శుభలక్షణ లక్షితయు నగు 'కమలాంబ' యను కన్యనువివాహ మొనర్చెను. ఆవివాహ మతివైభవముగ జరిగెను. ఊరివా రందరును, బంధువర్గమును

నూతనవధూవరులను జూచి యానందించి వారి నాశీర్వదించిరి. కామాంబ లింగన్నమంత్రుల యానందమునకు మేరయే లేదు. వివాహానంతరము పెండ్లివారును, బంధువర్గమును యెవరి యిండ్లకు వా రేగిరి. కొంతకాలము సుఖముగనే గడచెను.

కాని కాల మెప్పుడు నొకేతీరున గడువఁబోదు కదా! మానవునకుఁ గష్టసుఖములు కావడికుండలవంటివి. విధినిర్ణయంబు ననుసరించి ప్రతివ్యక్తియును కష్టసుఖముల ననుభవింపక తప్పదు.

కొంతకాలమునకుఁ గామాంబయు, లింగన్నమంత్రియు నొకరివెనుక నొకరు స్వర్గస్తులైరి. గోపన్న తలిదండ్రులవియోగమునకు మిగుల దుఃఖించి యతిభక్తిశ్రద్ధలతో వారి కపర క్రియలను యథావిధిగా నొనరించెను. బ్రాహ్మణులకును, బీద సాదలకును సంతర్పణములుచేసెను. అనేకదానములుచేసెను. పిదప గోపన్న తల్లిదండ్రుల కొఱకుఁ దఱచు విచారించుచు పెద్దల యోదార్పు వచనములతోఁ దిరిగి ధైర్యముఁ దెచ్చుకొనుచు నొంటరివాఁడై కాలమును గడపుచుండెను.

ఇంతలో గోపన్న భార్యయగు కమలాంబ కాపురమునకు వచ్చెను. సర్వలక్షణాలంకృతయు, సుగుణఖనియు, మహాపతివ్రతయునగు కమలాంబ లక్ష్మీదేవివలె గోపన్నయింట నడుగుఁ బెట్టెను. ఆనాటినుండియు గోపన్న ధనధాన్యములును, పాడి పంటలు నభివృద్ధి కాసాగెను. ఆదంపతులు సుఖముగ సంసారమును జేసికొనుచుండిరి. బీదసాదలను కమలాంబ తనబిడ్డల

వలెఁ జూచుకొని యాదరించెడిది. ఆగ్రామమునకుఁ గమలాంబ, అతిథ్యభ్యాగతులకును, అన్నాతురులకును అన్నపూర్ణాదేవియే. గోపన్న గ్రామస్థులలోఁ బెద్దలను గౌరవించుచు, పిన్నల నాదరించుచు, గ్రామస్థు లందరికిని మంచివాఁడై గౌరవపాత్రుఁడగుచుండెను.

ఆగ్రామములో గోపన్నయే పెద్దగృహస్థు! అతని కే లోటును లేదు. అతఁ డనుకూలవతియగు భార్యతోఁ గాపురముఁ జేయుచు, యతిథ్యభ్యాగతుల కాతిథ్య మొసంగుచు, బీదసాదలకు దానధర్మములు చేయుచుఁ బుణ్యకాలక్షేపముఁ జేసికొనుచు, శ్రీరామభక్తిపరుఁడై కాలక్షేపముఁ జేయుచుండెను. అతఁడు ప్రతి శ్రీరామనవమికి శ్రీసీతారాముల కళ్యాణ మహోత్సవ మతివైభవముగఁ జేయుచుండెను. బ్రాహ్మణ సంతర్పణలు, శ్రీరామ నవరాత్రోత్సవములు, ఊరేగింపులు, పూజలు, భజనలు మొదలైనవి చేయుచు, చేయించుచు గోపన్న మహాభక్తుఁ డగుచుండెను.

ఇట్లు భక్తిపరుఁడై, సంతుష్టమనస్కుఁడై కాలముఁ గడుపుచున్న గోపన్నభార్య కమలాంబ యొక శుభలగ్నంబున బాలసూర్యుం డనదగు నొకపుత్రరత్నమును గనెను. రఘురామ కృపావిశేషముచేఁ దన కొక సుపుత్రుఁ డుదయించెనని విని గోపన్న యానందించి యాముద్దుబిడ్డకు 'రఘురాముఁడు' అని పేరిడి పుత్రోత్సవముఁ జేసెను.

ఇట్లిరువది సంవత్సరములు నిండకముందే గోపన్న యిహపరలోక సుఖాభిలాషిణియగు సహధర్మచారిణిని బరిణయ మాడి, పితౄణవిముక్తింజేయు సుపుత్రుం గాంచి, బీదసాదలకు దానధర్మములుఁ జేయుచు, సంపన్నగృహస్థుడై గృహస్థ ధర్మంబు లాచరించుచు నిహలోకసుఖము లశాశ్వతము లని యెఱింగి శ్రీరామపాదారవిందధ్యానమే ముక్తిప్రదమునిగ్రహించి నిత్యమును రామభక్తుడై, రామదాసుఁడై కాలముఁ బుచ్చు చుండెను.

## క ఱ వు

ఇట్లుండ నొకసంవత్సరమున గోల్కొండరాజ్యమున గొప్పకఱవు సంభవించెను. వర్షములు వెనుకఁ బట్టెను. ఏఱులు, వాగులు నెండిపోయెను. అంటువ్యాధులు వ్యాపించెను. ప్రజ లకుఁ దినుటకుఁ దిండిలేదు. త్రాగుటకు నీరులేదు. చేతఁ గాసైన లేదు. ఈస్థితిలో నారాష్ట్రమంతయు మలమల మాడి పోవుచుండెను.

అట్టిస్థితిలో గోపన్న ప్రజలబాధలను జూచి సహింపలేక పోయెను. వెంటనే నిలువయున్న గాదె లొకటివెనుక నొకటి తెఱచి ప్రజలకుఁ దిండి పెట్టి పోషింపసాగెను. కమలాంబయు నన్నపూర్ణాదేవి సాక్షాత్కరించెనా యన్నట్లు విధివిరామములు లేకుండ, నహర్నిశములు లేదనకుండ నమిత్రోత్సాహముతో

నన్నదానమును జేయసాగెను. గాదు లన్నియుఁ గ్రమముగా నైపోయినవి. గోపన్న స్వకుటుంబ పోషణార్థము నిలువయుంచు కొనిన గాదులుకూడ కర్చు పెట్టెను. ఇంకను కఱవు తగ్గలేదు. ఆతఁడు తనయొద్దనున్న ధన మంతయు కర్చుపెట్టి యన్నదాన మునుజేసెను. అదియును సరిపోలేదు. కమలాంబ వస్తువాహ నములుకూడ విక్రయించి యన్నదానము జేసెను. సరిపోలేదు. తనకున్న భూములుకూడఁ జాలవరకు విక్రయించి యన్నదానము జేసెను. అప్పటికిఁ గఱవు కొంచెము తగ్గసాగెను. గోపన్న కీర్తి దేశమంతటను వ్యాపించెను. కమలాంబగారి చేతి యన్న మును దినని వ్యక్తి యొక్కఁడైన నీ రాష్ట్రమున లేడేమోనని జను లనుకొనిరి. గోపన్నకీర్తి గోల్కొండ సంస్థానపు మంత్రు లును, గోపన్న మేనమామలు నగు అక్కన్న మాదన్నలుగూడ విని యానందించిరి. గోలకొండ నవాబగు "తానీషా"కూడ గోపన్న కీర్తిని విని గోపన్న ధార్మికబుద్ధికి సంతసించెను.

## గురూపదేశము.

గోపన్న కిఁకఁ గొలఁది భూవసతి మాత్రమే మిగిలి యుండెను. కఱవు తగ్గిపోయెను. పంటలు యథాప్రకారము పండసాగెను. ప్రజ లింత యన్నవస్త్రములకు లోటు లేకుండ యథాప్రకారము కాలముఁ గడుపసాగిరి.

గోపన్నకాని యతని సతీమణికాని కఱవు మూలమున తమ యాస్తిలోఁ జాలభాగము వ్యయమైపోయినందుల కావం

త్తైన విచారించ లేదు. పైగ భగవంతుఁడు తమ కొసఁగిన సంపద నీ విధముగ సత్కార్యమునకు వ్యయపెట్టఁ గలిగితిమి గదాయని సంతసించుచుండిరి.

ఆనాఁటి కానాఁడు గోపన్న యథాప్రకారము భక్తి పర వశుఁడై పోవుచుండెను. వారింట నొక భాగము శ్రీరామ భజన మందిరముగ నేర్పాటు జేసెను. అం దహోరాత్రములు గోప న్నయు, నితర భక్తబృందమును రామనామ స్తోత్రములు, భజ నలు, పూజలు చేయుచు నిత్యమును రామ నామామృతమును గ్రోలుచుండిరి. క్రమక్రమముగ భక్తు లధికమై పోవుచుండిరి. గోపన్న రామ భక్తాగ్రేసరుఁడని విని యితర గ్రామముల నుండికూడ భక్తులు తండోపతండములుగ వచ్చుచుండిరి. వారు గోపన్నతోపాటు రామభజనలోఁ బాల్గొని రామ నామామృతమును గ్రోలి తన్మయత్వము నొంది యానందించు చుండిరి.

ఇట్లుండ నొకనాఁడు యథాప్రకారముగ గోపన్న తన భక్తబృందముతో రామభజన చేసి చేసి, తన్మయత్వము నొంది యుండెను. భక్తు లందరును నిశ్శబ్దముగ నుండి గోపన్న వైపు చూచుచు వేచియుండిరి. అట్టి సమయమున వీధిలోనుండి—

"నారాయణా నారాయణా నారాయణా భగవ
న్నారాయణా నారాయణా నారాయణ ॥నా॥
సజ్జన్సే సజ్జన్మిలేతో చందన్మే కర్పూర్
దుర్జన్సే దుర్జన్మిలేతో భంగ్ మే దత్తూర్ ॥నా॥

రామనామకా మర్మ న జానే కలీకాలకాభూత్
సాహెబుకాంగరదూరహై బేజై సేలంబికజూర్ ॥నా॥"

అను రామనామసంకీర్తనము వినఁబడెను. గోపన్న కా సంకీర్తన మమృతసిష్యందమువలె వినిపించెను. వెంటనే యతఁడావీథిలోనికి వచ్చి చూచెను. కాషాయాంబరధారియగు నొక ఫకీరు రామనామసంకీర్తనమును జేయుచు వచ్చి గోపన్న గృహాముకడ నాగెను. గోపన్న యాఫకీరు చేయు రామనామ సంకీర్తనము విని తన్మయత్వముతో సూగిపోవుచు ఫకీరునకు భక్తిపూర్వకముగ నమస్కరించి 'మహాత్మా! ముక్తిమార్గమును బోధించి నన్నుద్ధరింపు' మని యాతనిపదములపైఁ బడెను.

ఆఫకీరు 'కబీరుదాసు' అను మహమ్మదీయ భక్తాగ్రేసరుఁడు. అతఁడు మహమ్మదీయుఁడైనను రామభక్తుఁడై రామ రహీంలకు భేద మేమియు లేదనియు విశ్వకళ్యాణమున కాధార భూతుఁడగు పరమేశ్వరుఁ డన్నిమతముల వారికి నొక్కఁడే యనియు బోధించి తరించిన మహాభక్తుఁడు!

అంతట కబీరు గోపన్నను లేవనెత్తి కౌగలించుకొని 'శ్రీరామచంద్రదర్శనప్రాప్తిరస్తు' యని దీవించి నాయనా! నీవు మహాత్ముఁడవు! నీశక్తి నీవే యెఱుంగకున్నావు. నీవు రామభక్తుడవనియు, మహాజ్ఞాని వనియు, తెలిసికొని నీభక్తి యతిశయించిన కొలఁదిని నీవు తప్పక శ్రీరామభక్తాగ్రేసరుఁ డవై పరమేశ్వరుని కృపాపాత్రుఁడ వగుదువని విశ్వసించి నీసం దర్శనభాగ్య మభిలషించి నీకు విశ్వవిఖ్యాతమంత్రమగు తారక

మంత్రము నుపదేశించి పోఁదలంచి వచ్చియుంటిమి. యింతటి నుండి నీవా తారకమంత్రమునే జపించుచు, సీశిష్యకోటి కుప దేశించుచు, తరింపుము. ప్రజలు నన్ను కబీరుదాసందురు. నిన్నింతటినుండి 'రామదాసు' అని పిలుతురుగాక!' అని దీవించి గోపన్న చెవిలో—

'శ్రీరామ రామ రామేతి రమే రామ మనోరమే
సహస్రనామతత్తుల్యం రామనామ వరాననే'

యని తారకమంత్రము నుపదేశించెను. అంతట గోపన్న మహదానందపరవశుఁడై 'మహాత్మా! ఏమి యీమంత్రోప దేశమహాత్మ్యము! నాశరీరమంతయు నొక్కసారి విద్యుచ్ఛక్తి వలె వ్యాపించి నే నెన్నఁడు నిదివఱ కెరుంగని యపూర్వమైన సవ్యానంద మొసంగి నన్నానందసాగరమున నోలలాడించు చున్నది. గురువరా! నీకరుణాకరత్వమునకు నాశతసహస్ర కృతజ్ఞతావందనము లనుచు—

'తారకమంత్రము కోరిన దొరకెను
ధన్యుఁడ నైతిని ఓరన్నా'

యని పాడుచు భక్తిపారవశ్యముతో గోపన్న తాండవ మాడసాగెను.

అంతట గోపన్నతో నున్నభక్తు లందఱు నీవిచిత్ర దృశ్యమును గాంచి, వారందఱునుకూడ కబీరుదాసు పాదము లపైఁబడి "మహాత్మా! మాకుగూడ ముక్తిమార్గమును బోధించి, పుణ్యము గట్టుకొనుఁ" డని ప్రార్థించిరి. కబీరు

వా రందఱను 'శ్రీరామచంద్ర దర్శన భాగ్య సిద్ధిరస్తు!" యని దీవించి, "భక్తవరులారా! నే నిప్పుడు మీ గోపన్న కుపదేశించిన మంత్రరాజ మమోఘమైనది. ఆ మంత్రము సంసారోత్తారక మంత్రము, సర్వైశ్వర్యదమగు మంత్రము, ముక్తి సహాయక మంత్రమునై ప్రకాశించుచున్నది. అదియే మీకును, నాకును, విశ్వమానవకోటి కంతకును తరుణోపాయము. మీ కామంత్రమును - దాని మాహాత్మ్యమును గోపన్న యుపదేశించును. ఆ మంత్రరాజమునే స్మరించి తరింపుఁడు" అని శాంత వచనములతోఁ గబీరు భక్తు లందరికిని రామనామ సంకీర్తన మహాత్మ్యమును బోధించి, గోపన్నతో "నే నెప్పుడు నన్ను తలఁచుకొనిన యప్పుడు నీకుఁ గనఁబడెదను. పోయివత్తు" నని చెప్పి వెడలిపోయెను.

గోపన్న కబీరున కనేక వందనము లొసర్చి, యాతని యవ్యాజ కరుణ కానంద భరితుఁడై యాతఁడు తన కన్నుల కగపడువఱకు నట్లే చూచుచు నిలువఁబడి తన దృక్పథమునుండి యాతఁడు దాటిపోయిన పిదపఁ గొంత తడవునకుఁ దన చుట్టు నున్న భక్తులవైపుఁ జూచి "భక్తులారా! చూచితిరా యీ మహాత్ముని మహిమ? ఈతఁడు భగవద్భక్తాగ్రేసరుఁడు. నా పూర్వజన్మ సుకృతము వలన, శ్రీరామచంద్ర కరుణా కటాక్షము వలన నీ మహనీయుని దర్శనము నేఁడు లభించినది. నేఁడు నా జీవితములోఁ బవిత్ర దినము. ఆతఁ డెంత శాంతమూర్తియో! ఎంత వైరాగ్యవంతుడో! ఎంత దివ్యజ్ఞాన ధనుఁడో! వచింప

లేము కదా? ఆ మహాభక్తుని యుపదేశములు వైరాగ్య భావ పూరితములు, దివ్యజ్ఞానామృత వాహినులు. మధుర వచనము లట్లో నాతఁడు బోధించునంత కాలమును మన మానంద సాగర మున నోలలాడితిమి కదా? ఆహా! రామనామ మెంత మహిమ కలది. ఈ యానంద సమయమున నొక్కసారి రామభజనఁ జేయుదము:

"భజరే శ్రీరామం హే మానస భజరే రఘురామం
భజ రఘురామం భండనభీమం రజనిచరౌఘవిరామం
రామం ॥భ॥"

అని కొంత తడవు గోపన్నయును, భక్త బృందమును భజనఁ జేసి బ్రహ్మానంద సుఖ మనుభవించిరి.

ఇట్లుఁ గొంత కాలము గడచెను. గోపన్న యింటికి వచ్చు భక్తుల సంఖ్య యానాటి కానాఁ డధికమగు చుండెను. వారందరికిని ప్రతి దినమును చేయు సంతర్పణలకై గోపన్న కొంత ఋణముఁ జేసెను. మరికొంత ...మున కాఋణదాతలు గోపన్నను పైక మిమ్మని తొందరఁ జేయగా నభిమాన ధనుఁ డగు గోపన్న తత్‌క్షణము తనకు మిగిలియున్న యావదాస్తి యును విక్రయించివైచి యా ఋణము లన్నియును దీర్చి వైచెను. ఇఁక నేమియు మిగుల లేదు.

ఆహా! దైవలీల! తనకొఱకై సర్వస్వమును త్యాగ మును జేసిన మహా భక్తులకే పరమేశ్వరుఁడు దారిద్ర్యాది కష్ట మును కలుగఁ జేయునుకదా! ఇది యంతయు భక్తుని బరీక్షిం

ములయందుగల ప్రత్యేకసౌధములపై వాయింపఁబడు ఢంకా, నౌబతు, నాగస్వర, సునాయి, మొదలగు హిందూమహమ్మదీయ మంగళవాద్యములతోడను, దేవాలయములందలి ఘంటానినాదంబులతోడను శోభాయమానముగా నాగోల్కొండపురము దివారాత్రములు నేత్రోత్సవ మొనర్చుచుండెను.

అట్టి మహానగరమున మహావైభవముతో 'అబూహాసన్ కుతుబుసాహా' యను మహమ్మదీయప్రభువు రాజ్యమును జేయుచుండెను. అతఁడు హిందువులను, మహమ్మదీయులను సమానముగఁ జూచుచుఁ బ్రజారంజకముగను, న్యాయసమ్మతముగను బాలించుచుండెను. దేశమాంధ్రదేశమును, ప్రభుత్వము తురుష్కప్రభుత్వము నైనప్పటికిని, యట్టిభేదమేమియుఁ గన్పట్టకుండ, హిందూబ్రాహ్మణ మహామంత్రిపుంగవులైన యక్కన్న, మాదన్నల, యమూల్య సహాయ సంపత్తితో నానవాబు ప్రజానమ్మతముగ రాజ్యపాలన మొనర్చుచుండెను. అతని పరిపాలనముచేఁ బ్రజలు సుఖపడిరి. ధనధాన్యసమృద్ధితోఁ దులతూగిరి. అందువలననే ప్రజలానవాబును, "తాన్‌శాహి" (మంచిరాజు) యని పిలిచెడివారు. ఆ తాన్‌శాహి యనుమాటయే క్రమముగా "తానీషా" క్రింద మారిపోయినది.

ఈ తానీషాకాలువులో మంత్రులుగా నున్న యక్కన్న మాదన్నలు మనగోపన్నకు మేనమామలే! వారిరువురును,

అసాధారణ మేధావంతులును, లౌకికజ్ఞానదురంధరులును, గొప్ప రాచకీయవేత్తలునై కీర్తిఁ గాంచియుండిరి.

వారిని తానీషా విశేషగౌరవముతోఁ జూచుచు వారి సలహా గైకొనకుండ నెట్టికార్యమును జేయువాఁడు కాడు. వారికిఁ దనతో సమానములగు సౌకర్యములను కలుగఁజేసి పోషించుచుండెను. వేయేల! అక్కన్నమాదన్నలే యించుమించుగ నాగొల్కొండరాజ్యమును బరిపాలించుచుండిరనిన యతిశయోక్తి కానేరదు.

అక్కన్నమాదన్నలు చాలకాలమునుండి వారి సోదరి యగు కామాంబయింటికి వచ్చియుండలేదు. గోపన్న తల్లిదండ్రులగు కామాంబ లింగన్నమంత్రులును గొల్కొండ వెళ్ళినట్లు కన్పింపదు. లింగన్నమంత్రి కొంచెము స్వతంత్రుఁడు. ఒకరిని లెక్కపెట్టువాఁడు కాఁడు. ఏరాజకార్యముల తొందరచేతనో అక్కన్న, మాదన్నలు గోపన్న బాలసారెమహోత్సవమునకు లింగన్నమంత్రిఁబిలువఁగా, రాలేదట! అప్పుడు లింగన్నమంత్రి గొప్పవారు తక్కువవారిండ్ల కెందుకు వత్తురనుచుఁ గోపోద్దీప్తుఁడై, యానాటినుండి వారితో నుత్తరప్రత్యుత్తరములు సైతము మానివైచి కక్ష వహించియుండెను. అట్లే క్రమముగ వారిరువురకును రాకపోకలుకూడఁ జాలకాలము నుండి తగ్గిపోయెను. గోపన్న కుటుంబమునకును, అక్కన్న మాదన్నల కుటుంబమునకును, మనకథాకాలమునాటికిఁ గల సంబంధ మీస్థితిలో నుండెను.

ఇట్లుండ నొకనాటిరాత్రి గోల్కొండలో మాదన్నమంత్రి రాజకార్యములు ప్రొద్దుపోవువఱకును జూచుకొని నిద్రించెను. ఆనాటిరాత్రి మాదన్నగారి కొక స్వప్నము వచ్చెను. ఆస్వప్నములో నొకరూపము లేని వ్యక్తి "మాదన్నా! నీవెంత గొప్ప యుద్యోగముఁ జేయుచుండిన నేమిలాభము? ఎన్ని దానధర్మములు చేయుచుండిన నేమిలాభము? ఎందరి కుపకారములు చేసిన నేమిప్రయోజనము? రాజ్యవ్యవహారముల నెన్ని నడిపించుచున్న నేమిప్రయోజనము? నీసోదరి కుమారుఁడును నీమేనల్లుఁడును, మహాభక్తుఁడునగు, గోపన్న నేలకొండపల్లెలో దానధర్మములకై ఁ దనయాస్తి నంతను గోల్పోయి, నేఁడు నిరుపేదయై జీవయాత్ర నతికష్టముపై సాగించుచున్నాఁడు. అతఁడు రామభక్తుఁడు, నిష్కళంక చారిత్రుఁడు. భద్రాచలము తహశీలుదారుఁ డీనడుమనే స్వర్గస్థుఁడైనాఁడు. ఆస్థానమున గోపన్నను తహశీలుదారుగా నియోగించి, నీధర్మమును నెరవేర్చుకొనుట యుక్త"మని పలికెను.

మాదన్న సంభ్రమాశ్చర్య భరితుఁడై నిద్రనుండి మేల్కొని, దిగ్గున లేచి కూర్చుండెను. స్వప్నములోని పలుకులింకను వినఁబడుచున్నట్లే యాతఁడు భ్రమపడుచుండెను. అతఁడా స్వప్నమునుగురించి మరలమరల యోజించుకొనెను. తనమేనల్లు నొక్కసారియైనఁ జూడకపోయినందులకును, తనకును, దివంగతుఁడైన తనబావగారగు లింగన్నమంత్రిగారికి నకారణముగఁ బెరిగిన విరోధభావమునకును, మిక్కిలి పశ్చాత్తాపపడెను.

ఇంతలోఁ దెల్లవాఱెను. అతఁడు వెంటనే కాలకృత్యం బుల నిర్వర్తించుకొని, స్నానాద్యనుష్ఠానంబులు గావించుకొని సభాస్థలి కరుదెంచెను. అప్పటి కప్పుడే వచ్చి సులోచనములు సవరించుకొనుచు రాజకార్య సంబంధములగు పత్రములను జూచుచున్న యక్కన్నగారితో మాదన్న రాత్రి తాను గనిన స్వప్న వృత్తాంతమును వివరించి చెప్పెను. వా రిరువురును గతిం చినదానికిఁ జాల విచారించిరి. తా మింతవఱకును గోపన్న విష యమై యుపేక్షించుట గొప్ప పొరబాటేయని పశ్చాత్తాప పడిరి. పిదప అక్కన్నగారు మాదన్నతో "మనయింట నీ నడుమ జరుగఁబోవు శుభకార్యమునకు గోపన్న నాహ్వానించిన బాగుండు ననుకొందును. పిదప మిగతవిషయము లాలోచింప వచ్చు" ననెను. మాదన్న యా యాలోచన మిగుల బాగుగ నున్నదని సంతసించెను. వా రిరువురు నిట్లాలోచించుకొని వెంటనే యొక శుభలేఖను వ్రాసి తగు సేవకులను, పాలకిని నాల్గైదు గుఱ్ఱములతో నేలకొండపల్లె గోపన్నకడకుఁ బంపిరి.

ఇది యిట్లుండ నేలకొండపల్లెలో గోపన్న యథాప్రకా రము దినదినమునకు నతిశయించుచున్న శ్రీరామభక్తిరసా మృత ప్రవాహములో నోలలాడుచు నిశ్చింతగఁ గాలక్షేపముఁ జేయుచుండెను. ఒకనాటి యుదయమున నాతఁడు తన భక్త బృందముతో రామభజనఁ జేయుచు—

"ఏతీరున నను దయఁ జూచెదవో
యినవంశోత్తమ రామా!

నాతరమా ? భవసాగర మీదను
నళినదళేక్షణ రామా !
శ్రీరఘునందన ! సీతారమణా !
శ్రితజనపోషక ! రామా !
కారుణ్యాలయ ! భక్తవరద ! నను
గన్నది కానుపు రామా !"

యని పాడుచుండెను.

ఇంతలో గోల్కొండనుండి యక్కన్న మాదన్నగార్లు పంపిన జవానులును, పల్లకీయును, గుఱ్ఱములును వచ్చి గోపన్న యింటిముందట నిలిచెను. అందొక సేవకుఁడు గోపన్నకు నమస్కరించి యొకలేఖ నిచ్చెను. గోపన్న యా లేఖ నందికొని యిట్లుఁ జదివికొనెను.

"శ్రీరస్తు చిరంజీవుఁడైన మా మేనల్లుఁడు కంచెర్ల గోపన్నకు మీ మేనమామలు అక్కన్న మాదన్నలు చిరాయువుగాను, పుత్రపౌత్రాభివృద్ధిగాను దీవించి వ్రాయించి పంపిన శుభ లేఖార్థములు—

ఈ మాసమున బహుళ దశమీ భానువాసరమున మా యింట జరుగు నుపనయన మహోత్సవమునకు నీవు సకుటుంబ బంధు మిత్ర పరివార సహితముగా వచ్చి మమ్మానందింపఁ జేయఁ గోరుచున్నాము.

మొదటినుండియు నేవో కొన్ని స్వల్పకారణములవలనఁ బట్టుదలఁ బ్రధానముగ నెంచుకొను మీ తండ్రిగారు మాతో

నమోధ్యగనుండుట గౌరవభంగమని యెంచి, కక్ష వహించి యుండిరి. అప్పటినుండియును మనకు రాకపోకలుగూడ లేక పోయెను. ఆయన తదనంతరముగూడ నెల్లప్పుడును రాచకార్యములతో నూపిరి సలుపకుండ నుండు మేమును యెప్పటి కప్పుడే నిన్నుఁ జూచుటకు రాఁ దలంచుచుండియును రాఁజాలక పోయితిమి. ప్రస్తుతము శుభకార్య ప్రయత్నములలో నుండుటచే, యీనౌకరులను, పల్లకిత్రోడను, గుఱ్ఱములతోడను పంపితిమి. నీవు మాయందు గౌరవ ముంచి, మాముద్దు చెల్లించి తప్పక రాఁ గోరుచున్నాము.

నీ వీనడుమ కలువ్రులోఁ జేసిన దానధర్మములను విని మిగుల నానందించితిమి. శ్రీరామభక్తుఁడవై, రామదాసుఁడవై, నిత్యమును రామభజనపరుఁడవై యున్న సంగతికూడ వింటిమి. నీపరిస్థితులుకూడఁ దెలిసినవి. పరమేశ్వరుఁడు భక్తుల ననేకవిధములఁ బరీక్షించుట సహజమే. ఆయగ్నిపరీక్షల కాగిన వాఁడే మహాభక్తుఁడై మోక్షము నొందును. నీ వెంత మాత్రము నధైర్యమును జెందక నీసేవకులతో సకుటుంబ పరివారముగా రాఁగోరుచున్నారము.”

గ్రహింపుము

ఇట్లు నీశ్రేయోభిలాషులు, మేనమామలు,

అ క్క న్న

మా ద న్న

గోల్కొండ సంస్థాన ప్రధానమంత్రులు.

ఈలేఖను జదివికొని గోపన్న కొంతతడ వాలోచనా నిమగ్నుఁడయ్యెను. తుదకాహ్వానముఁగూడ శ్రీరామచంద్రాను గ్రహమే యనుకొనెను. వెంటనే భార్యయగు కమలాంబకుఁ గూడ నాలేఖను జూపి యామెతో నాలోచించెను. సేవకు లందఱకును భోజనము లిడి, యాదంపతులుకూడ భోజనము నొనర్చి, కొంతతడవు విశ్రాంతిఁ గైకొని, పిదప గోల్కొండకుఁ బ్రయాణ మైరి. వీరి ప్రయాణఁపుసంగతి విని గ్రామస్థు లంద ఱును నాబాలగోపాలమును వీరింటి కరుదెంచిరి. అందఱును వారియెడఁబాటు నొక్కదినమైన సహింపఁ జాలమనియును, తిరిగి త్వరలో రమ్మనియును వేడికొనిరి. కమలాంబాగోపన్నలు తిరిగి త్వరలోనే వత్తుమని వారితోఁ జెప్పి వారిని సమాధాన పఱచి వా రందరికడను సెలవుఁ గైకొని ప్రయాణమైరి. కమ లాంబ పల్లకిలోను, గోపన్న యొక యశ్వముపైన నెక్కియు గోల్కొండకు సేవకులతో బయలుదేరి వెడలిపోయిరి.

గోల్కొండ వీరు చేరుటతోడనే యక్కన్న మాదన్న గార్లును, వారి కుటుంబమును, కమలాంబాగోపన్నల నెంతో సంతోషముతో నెదుర్కొని లోనికిఁ గొంపోయిరి. వారిక్షేమ సమాచారముల నడిగి యెంతో గౌరవించిరి. మరికొన్ని దిన ముల కుపనయనమహోత్సవ మతివైభవముగ జరిగిపోయెను. బంధుగు లందరు నెవరియూరు వారు వెడలిపోయిరి. పిదప నొకనాఁడు గోపన్నను దోడ్కొని యక్కన్న మాదన్నలు తానీషా దర్బారున కేగిరి. తానీషాకు గోపన్నను జూపి యతఁడు

తమ మేనల్లుఁడును, నేలకొండపల్లి వాస్తవ్యుఁడగు 'కంచర్ల గోపన్న' యని తెలియఁబఱచిరి.

తానీషా :—మే మితని పేరిదివఱకే వినియుంటిమి. ఇతఁడీనడుమ సంభవించిన కఱవులో ననేక జనులను బోషించెనట కాదా ?

అక్కన్న :—ఔను మహాప్రభూ! ఇతఁడు నిరంతర శ్రీరామ చంద్రచరణారవింద సేవకుఁడు, నిష్కల్మషచిత్తుఁడు. నిత్యసత్యవ్రతుఁడు. మా బంధుగుఁ డని పొగడుట కాదు. ఇతని కీర్తిన్నే యందఱులకు సాక్షి.

తానీషా :—ఔను. నేనును వింటిని. ఇతఁడు మన సంస్థానములో నున్నచో బాగుండును.

అక్కన్న :—తమ యనుగ్రహ మున్నచో నదియు సమకూడును. భద్రాచలము తహశ్శీలుదారుఁ డీనడుమనే దివంగతుఁ డగుటచే ప్రస్తుత మా పదవి ఖాళీగా నున్నది.

తానీషా :—మంచిసంగతి జ్ఞాపకము చేసితిరి. ఇతఁడు శ్రీరామ చంద్ర భక్తుఁడంటిరికదా! ఇఁక నేమి! శ్రీరామ చంద్ర నిలయమగు భద్రాచలమున నుద్యోగమును జేయుట కాయన కభ్యంతర ముండ దనుకొనెదము. ఆయన యంగీకరించినచోఁ దత్క్షణమే యా పదవి నాయన కొసంగుటకు మా కెట్టి యభ్యంతరము నుండదు.

అక్కన్న :—చిత్తము! తమయాజ్ఞ కాతఁడు బద్ధుఁడే.

తానీషా :—అట్లైన ఫర్మానా వ్రాయింపుఁడు.

మాదన్న :—లేఖరీ! గోపన్నను భద్రాచలము తహశ్శీలుదారుగా నియమించినట్లు ఫర్మానాను వ్రాసి తెమ్ము.

గోపన్న తలవని తలంపుగ జరుగుచున్న యీ కార్యక్రమ మంతయును జూచుచు నదియంతయు శ్రీరామచంద్ర ప్రభావమే యనుకొని యాశ్చర్య పడుచుండెను.

లేఖరి ఫర్మానాను వెంటనే వ్రాసి యక్కన్నగారికి సమర్పించెను. అక్కన్నగా రా ఫర్మానాను తానీషా యెదుట నుంచెను. తానీషా యందుఁ దన చేవ్రాలిడి యా ఫర్మానాను గోపన్న కిచ్చి వెంటనే భద్రాచలమున నా యుద్యోగమునఁ జేరుమని కోరెను. ఆ ఫర్మానాను శ్రీరామాజ్ఞగనే భావించి గోపన్న మహాప్రసాదమని తానీషాకు నమస్కరించి యా ఫర్మానానుగైకొనెను. ఆనాటి కక్కన్న మాదన్నలును గోపన్నయును తానీషాకడ సెలవుఁ గైకొని మహానందముతో నింటి కేగిరి. ఆ మఱునాడే యక్కన్న మాదన్నలు గోపన్నకుఁ గొన్ని ముఖ్య సలహాల నొసఁగి కడు మెలఁకువతో నుద్యోగ కార్యములు నిర్వర్తించుచుండు మనియును రైతులను బిడ్డలవలెఁ జూచుచుఁ బ్రజల నాదరించుచుఁ జక్కఁగఁ బరిపాలించుచు నీ పదవిని నిలఁ బెట్టుకొనుమనియు బోధించి, దీవించి, వెంటనే తగు పరివారముతో సురక్షితముగ భద్రాచలమున కంపివేసిరి.

# 4. దేవాలయ నిర్మాణము

"కైంకర్యము చేసెను రామదాసు ॥కైం॥
రమణ భద్రగిరి రామాలయ
మత్యమలానందంబై ధరలోపల
పెరసెడిరీతిని మేలిమి గాగను. ॥కైం॥

తెల తెలవారుచుండెను. సూర్యభగవానుఁ డుదయించు చుండెను. ఆ లోకబాంధవు ననేకశతసహస్రకిరణజాలము జీవకోటి కానందదాయకముగఁ బ్రకాశించుచుండెను. ప్రభాత సమయమునవీచు నిర్మలమందమారుతము వివిధపుష్ప సౌరభములతో హాయిగ వీచుచుండెను. పక్షులు తమమధురకంఠములతోఁ గిలకిలారావములు చేయుచు సూర్యునిఁగూర్చి జయగీతములు గాన మొనర్చుచుండెను. పరమపావనిఘగు గోదావరీ నది నిండునీటితో నిక్కిలి వడిగఁ బ్రవహించుచుండెను.

అట్టిసమయమున గోపన్న కుటుంబసహితముగ నిజపరివారముతో భద్రాచలము సమీపించుచుండెను. అతనిదృక్పథమున శ్రీరామచంద్రుని దివ్యక్షేత్రమగు భద్రగిరి గోచరించెను.

"అదిగో! భద్రాద్రీ! గౌతమి! ఇదిగో చూడండి
ముదమున సీతాముదితలక్ష్మణులు!
కదిసి కొలువగా రఘుపతి యుండెడి ॥అ॥"

అని గానముఁ జేయుచు మహానందభరితుఁ డయ్యెను. మరికొంతతడవునకు వారు శ్రీ భద్రాచలమును జేరిరి. గోపన్న కుటుంబసహితముగ ముందుగ శ్రీభద్రాచలరాముని దర్శించి

భక్తిపూర్వకముగ నాదేవునకు నమస్కరించెను. ‘శ్రీరామ చంద్రా! భద్రాద్రివాసా! తండ్రీ! నీవే సర్వస్వమునని నమ్మి నిన్ను గొలుచుచున్న నన్ను నీపాద సాన్నిధ్యమునకుఁ జేర్చు కొంటివి. నీపరమకృపారసము నాపై వెదజల్లితివి. నన్నుద్ధరించితివి. రామభద్రా! నీవే భక్తులపాలిటి పెన్నిధివి. నిరంతరమును నీపాదసేవఁ జేయుభాగ్యము నాకు నేటినుండి లభింపఁజేసితివి. నీకనేక కృతజ్ఞతావందనములు. ఆర్తత్రాణపరాయణా! దీన చింతామణీ! ఇఁక నీయుద్యోగమున నన్నురక్షించుభారము నీదే! నీదాసానుదాసుఁడను. రక్షింపు’ మని గోపన్న యనేక విధముల నాభద్రగిరీశునిఁ బ్రార్థించి స్తోత్రముఁజేసెను. ఆతఁడా భక్త్యావేశముతో—

“ఉ. భండనభీముఁ డార్తజన
బాంధవుఁ డుజ్జ్వలబాణతూణ కో
దండ కళాప్రచండ భుజ
తాండవకీర్తికి రామమూర్తికిన్
రెండవసాటిదైవ మిఁక
లేఁ డనుచున్ గడకట్టి భేరికా
డాండ డ డాండ డాండ నిన
దంబు లజాండము నిండ మత్తవే
దండము నెక్కి చాటెదను
దాశరథీ! కరుణాపయోనిధీ!

అని రామచంద్రు ననేకవిధములఁ గీర్తించి, రామ భజనఁ జేసి, రామనామామృతమును గ్రోలి, యానందరసాబ్ధిని దేలి తన నూతన నివాసమున కేగి, తన యుద్యోగమునఁ జేరెను.

పిదప గోపన్న భద్రాచలమున తహశ్శీలుదారుగఁ దన యుద్యోగకార్యములు చక్కఁగ నిర్వర్తించుచు, బీదసాదల కుపకారముఁ జేయుచు, నిత్యమును శ్రీరామనామ సంకీర్తనముఁ జేసికొనుచుఁ బురాణకాలక్షేపములతో - హరికథలతో - రామభజనలతో - శ్రీరామకళ్యాణోత్సవములతో - బ్రాహ్మణ సమారాధనలతో - నిత్యకళ్యాణముగ - సకలజనానందకరముగఁ గాలమును గడుపుచు యశోవిరాజితుఁ డగుచుండెను.

అప్పటికే శ్రీభద్రాచల దేవాలయము శిథిలావస్థలో నుండెను. పూర్వమెప్పుడో 'తమ్మలదమ్మక్క' యను భక్తురాలప్పటికి నామమాత్రావశేషముగ నున్న భద్రాచలమున శ్రీరామచంద్రుల విగ్రహములు వెలసియున్నవని కలఁగని మహాభక్తితో వెదకించి, యా దివ్యమంగళ విగ్రహముల నొకచోటఁ గనుఁగొని యచ్చటనే యొక దేవాలయముఁ గట్టించి ధన్యురాలయ్యెనట! ఆ దేవాలయమే మన గోపన్న చూచునప్పటికి శిథిలావస్థయం దుండెను. గోపన్న కా దేవాలయము తిరిగి చక్కఁగ నిర్మించవలెనను నూహ జనించెను.

ఇట్లుండ శ్రీరామనవమి సమీపించుచుండెను. గోపన్న ప్రతిసంవత్సరముకంటె నీ సంవత్సరము మహావైభవముగ శ్రీరామనవరాత్రోత్సవములు చేయఁ దలంచెను. తాలూకా యందలి

ముఖ్యగ్రామము లన్నిటికిని దాను స్వయముగ నేగి యాయా గ్రామములందలి ప్రజలతో దాను జరుపఁ దలఁచిన శ్రీరామ నవరాత్రోత్సవముల సంగతిఁ దెలియఁ జేసెను. వారి నందఱ నాయుత్సవముల కాహ్వానించెను. సర్కారువారి కంతవఱకును గ్రామములనుండి రావలసిన బాకీలన్నియును వసూలు చేసి పంపివైచెను.

తానిఁక నిశ్చింతగ శ్రీరామ నవరాత్రోత్సవములకు వలయు నేర్పాటు లతిచురుకుగఁ జేయించుచుండెను.

శ్రీరామనవరాత్రోత్సవములు ప్రారంభ మయ్యెను. వేల కొలఁది జను లన్నిగ్రామములనుండియు విచ్చేసిరి. భద్రాచల పుర మంతటను బందిళ్లు వేయఁబడెను. నగర మంతయు భజనలతోఁ, బూజలతో, మంగళవాద్యములతో, వేదాధ్యయనములతో, మహాజన కోలాహలముతో, భూరిసమారాధనలతో నిండిపోయి భూలోక వైకుంఠమువలె నుండెను.

భద్రాచలము తాలూకాలోని యనేక గ్రామముల నుండి ప్రజలు లెక్కలేనన్ని బండ్లతో, కావిళ్ళతో విధివిరామములు లేకుండ సర్వసంభారములను, కానుకలను సేకరించుకొని వచ్చుచుండిరి. ఉత్సవములు మహావైభవముగ జరిగిపోవుచుండెను. గోపన్న ప్రతిదినమును శ్రీరామచంద్రునకుఁ బూజాపునస్కారములు యథావిధిగ నొనర్చుచు, రామాయణ కాలక్షేపమును, హరికథలను వినుచు, రామభజనఁ జేయుచు, తారకనామము స్మరించుచు, సమారాధనలు చూచుచు, ప్రజ

లందరి నాదరించుచు, ఉపవాసముతో దినమంతయు నుండుచు, రాత్రిమాత్రము కొంచెము ఫలాహార మొనర్చుచు, నానంద తరంగితాత్ముఁడై పోవుచుండెను.

శ్రీరామనవమినాఁ డింకను మహావైభవముగ నుత్సవము జరిగెను. ఆనాఁడు శ్రీ సీతారామచంద్రుల కళ్యాణోత్సవము జరిగెను. గ్రామస్థు లనేక కానుకలు సమర్పించిరి. ఆనాటి కానుకల మొత్తె మిరువదివేలరూకలకు మించి యుండెను. ఒక వైపున బ్రాహ్మణసమారాధనము జరుగుచుండెను. అనేక వేల బ్రాహ్మణు లాదివ్యప్రసాదమును మహానందముతో భుజించు చుండిరి. గోపన్న తన భక్తబృందముతో రామభజనఁ జేయుచుఁ దాండవ మాడుచుండెను. అతఁడు తన్మయత్వముతో నానంద రసతరంగములలోఁ దేలిపోవుచుండెను. అంతయు బ్రహ్మానంద మయముగ నుండెను.

అట్టి మహానందసమయమున వంటశాలలో గంజిగుంట ప్రక్క నాడుకొనుచు గోపన్న కుమారరత్నమగు 'రఘు రాముఁడు' కాలుజారి యావేడిగంజిగుంటలోఁ బడిపోయెను. వంటబ్రాహ్మణు లదిచూచి తత్క్షణమే యాబాలుని పైకిఁ దీసి కమలాంబకడకుఁ గొనివచ్చిరి. బాలునకిఁ జైతన్యము లేదు. ఆతని శరీరము కాంతి తరిగి యుండెను. బాలుఁడు మూర్ఛా గతునివలె పడియుండెను. ఇఁక కమలాంబవిచారమునకు మేర యే లేదు. ఆమె విచారమును బట్టఁజాలకఁ గ్రింద బడిపోయెను. చెంతనున్న నారీమణు లామెకు శైత్యోపచారములఁ జేసి లేవ

నె త్తి యోదార్వసాగిరి. ఆమె తెలివిఁ దెచ్చుకొని 'శ్రీరామ పాదారవిందభక్తులమగు మా యేకైకపుత్రునికే యిట్టియాపద రావలెనా?' యని మిగుల వగచుచుండెను. ఆమె యచ్చట నున్నవారి నీదుఃఖవార్తను గోపన్నకుగాని, భోజనాదికములు చేయుచున్న యితరు లెవ్వరికిఁగాని తెలియనీయవలదని కట్టడి చేసి తానుమాత్రమే యాబిడ్డ నొడి నిడికొని యేడ్చుచుండెను.

ఇంతలో బ్రాహ్మణసమారాధన ముగిసెను. గోపన్న కెట్లో యీదుఃఖవార్త తెలిసెను. వెంటనే గోపన్న యొక్క పరుగున తనబిడ్డకడకు వచ్చెను. భార్యయొడిలోనున్న బిడ్డను బుజముపై వైచుకొని తిన్నగా భద్రాచలవాసుని దేవాలయము కడకుఁ బోయెను. అతని వెంటనే యతని భార్యయు, భక్తకోటియు, బ్రాహ్మణబృందమును, ప్రజలును బైలుదేరి దేవాలయమును జేరిరి. గోపన్న దేవాలయద్వారముకడ నిర్జీవుఁడగు తనపుత్రుని బడవైచి శ్రీరామచంద్రమూర్తీ! తండ్రీ! నిన్నే నమ్ముకొని, నీపేరిడికొని, నీపాదారవిందధ్యానము తప్ప నితరము నెఱుఁగక యతిగారాబముగఁ బెంచుకొనుచున్న యీ మా యేకైకపుత్రునకే యిట్టియాపదఁ గలుగఁ జేయవలెనా? దయానిధీ! నావలన తప్పేమి? నీకళ్యాణమహోత్సవ మొనర్చి బ్రాహ్మణసమారాధనఁ జేయుచు నీ నామామృతమును గ్రోలుచు, బ్రహ్మానందమునను్న నాకిట్టి తీరనిచింతఁ గలుగ జేయుట పాడియా? ఇదియేనా నీభక్తవాత్సల్యము! ఇంక నీపేరుతో మేమెవ్వరిని బిలుచుకొందుము? నాభార్య కేమి

చూపి యీ తీరని దుఃఖమును బాపుననెదవు? నీవే సర్వస్వము నని నమ్మి మా సిరిసంపదలను, యిల్లువాకిండ్లను, స్వగ్రామ మును కూడ వదలి నీ పాదారవిందములే గతి యనుకొని నీ యిచ్చవచ్చినరీతిని మెలంగుచున్న మా యీ యేకైకపుత్రుని ప్రాణములనే తీసికొనవలెనా? కృపానిధీ! నా పుత్రునికి బ్రాణ దానమును జేసి రక్షింపవా? నీ జీర్ణ దేవాలయము పునర్నిర్మాణ మొనర్పఁదలఁచి మహాప్రయాస పడుచుంటినే? నాకీకష్ట మేల గలుగఁ జేసెదవు తండ్రీ?' యని పరిపరివిధములఁ బరితపించుచు రామచంద్ర ధ్యానతత్పరుఁడై వేడికొనుచుండెను.

ఇంతలో బాలుఁడు కొంచెము కదలెను. కన్నుల తెఱచి చెంతనున్న తల్లిదండ్రులను జూచెను. గోపన్న బ్రహ్మానంద భరితుఁడయ్యెను. కమలాంబ యానందాశ్రువుల్తో బాలుని దడిపివైచెను. 'మా కన్నతండ్రీ! మా కన్నులవెలుఁగా! బ్రతికి తివా! నాయనా! శ్రీరామచంద్రమూర్తీ! నీ ప్రభావ మచిం త్యము, అపారము, ఊహాతీతము' అని వేనోళ్ళఁ బొగడుచు నా దంపతులు మహాసంతోషముతో నిజ నిలయముఁ జేరిరి. ప్రజలందఱు నీ దృశ్యమును జూచి యాశ్చర్యచకితులై పోయిరి. గోపన్న మహాభక్తాగ్రేసరుఁడని కీర్తించిరి. భద్రాచలరాముఁడు భక్తచింతామణి యని పొగడిరి. ఆనాటినుండియును తాలూకా ప్రజ లందఱును గోపన్నను మహాత్మునిగాఁ దలఁచుచు నతని యాజ్ఞానుసారముగ మెలఁగుచు నాతనినే దైవముగ భావించు కొని సంచరించుచుండిరి.

కొంతకాలమునకు గోపన్న తాను శ్రీరామునియెదుట వాగ్దానము జేసినప్రకార మా దేవుని జీర్ణదేవాలయమును బునర్నిర్మాణ మొనర్పఁ బూనుకొనెను. ఆ మహాకార్యమున కమితధనము కావలసియుండెను. చేతఁ గాసైన లేని నే నెట్లీ మహాకార్యమును జేయఁ గల్గుదునాయని గోపన్న కొంత దిగులు చెందెను. కాని యన్నిటికిని భక్తవత్సలుఁడగు శ్రీరామచంద్రు నిదే భార మనుకొనెను. శ్రీరామనవరాత్రోత్సవములకు వచ్చిన కానుకలు సుమా రిరువదివేల రూకలు గలవుకదా! యని ధైర్యమును జెందెను. మిగతధనమునకై గోపన్న తాలూకాలోని యన్నిగ్రామములకు నేగి ప్రజ లందరితోడను తాను తలపెట్టిన మహాకార్యవిషయమును దెలియఁ బఱచి వారివారి శక్త్యానుసారము శ్రీరామకైంకర్యమునకుఁ గానుకలను సమర్పింపుఁడని కోరెను. కతిపయదినములలో నన్నిగ్రామముల నుండియును గ్రామాధికారులు తాము వసూలు చేసిన ద్రవ్యమును గైకొని వచ్చి గోపన్నకు సమర్పించిరి. ఆ ద్రవ్యము సుమారు పదివేల రూకలవఱకు నుండెను. అదిగాక యనేకమంది ద్రవ్యసహాయ మొనర్పలేని బీదజనులు దేవాలయనిర్మాణమునందు శక్తివంచన లేక కూలిఁ గైకొనకుండ సేవఁ జేయుట కరుదెంచిరి. ఒక సుముహూర్తమున గోపన్న శ్రీరామచంద్ర దేవాలయ పునర్నిర్మాణమును బ్రారంభించెను. ముందుగ జీర్ణదేవాలయ ప్రాకారములు పూర్తిగఁ దొలగింపఁ జేసి, మంచి శిల్పులను రప్పించి, నూతనదేవాలయములను, మంటపములను గట్టించుట కారం

భించెను. ప్రతిదినమును వేలకొలఁది జను లాపర్వతముపై బని జేయుచుండిరి. దివ్యమైన దేవాలయమును, చక్కని మంటపము లును, అందమైన ప్రాకారములును, మఠములును, రథము లును, గోపురములును, ధ్వజస్తంభములును, వాహనములు మొదలగున వన్నియు నతిచురుకుగఁ దయారై పోవుచుండెను. గోపన్నకడ నున్న ధన మంతయు నైపోయెను. భక్త్యావేశ ముతో నాతఁడు సర్కారువారి ఖజానాకూడఁ దెఱచి యం దలి పైకముకూడ ధారాళముగ ఖర్చుచేసి వైచుచుండెను. ఇంకొక నాల్గుమాసములలోఁ బని యంతయుఁ బూర్తి యయ్యెను.

భద్రాచలము కలియుగ వైకుంఠమువలె నలరారు చుండెను. మహోన్నతప్రాకారమును, గోపురమును, ముఖ మంటపమును, కల్యాణ మంటపమును, ధ్వజస్తంభమును, చక్కఁగ నిర్మింపఁబడెను. అనేకరకముల వాహనము లతిసుంద రములుగ తయారు చేయఁబడెను. గర్భాలయ మతిరమణీయ ముగ నలంకరింపఁబడెను. రథములు, మంటపములు, కూట ములు, రథశాలలు, వాహనశాలలు, నితరదేవాలయాదులు మొదలగునవన్నియు నానాటి మహాశిల్పులచే నతిమనోహర ముగ నిర్మింపఁబడెను. కోవెలపైఁ గాంచనశిఖర మందముగ నమర్పఁబడెను. శ్రీసీతారామలక్ష్మణుల కనేక సువర్ణరత్న మణి మయాలంకారములు చేయింపఁబడెను. దేవాలయమునకుఁ గావలసిన పాత్రసామగ్రి యంతయు వెండితోఁ దయారు

కాఁబడెను. వేయేల? దేవాలయాదులును, సర్వాలంకారము లును, కన్నులకఱవుఁదీర చూడవలెనేకాని వ్రాయనలవికాదు.

సర్వము సంసిద్ధమైనయట్టియెడ నొక శుభముహూర్త మున గోపన్న తాలూకాయందలి ప్రజ లందఱి నాహ్వానించి మహావైభవముగ శ్రీసీతారామలక్ష్మణుల దివ్యవిగ్రహముల నాభద్రశైలమున నూతనదేవాలయమునఁ బ్రతిష్ఠించి ధన్యుఁ



భ ద్రా చ ల దే వా ల ము.

డయ్యెను. అతనిజన్మమున కంతకన్నఁ గావలసిన దేమున్నదని ప్రజ లనుకొని గోపన్న ననేకవిధములఁ గొనియాడిరి. ఒక వైపున దివ్యమంగళవాద్యములు మ్రోగుచుండెను. అమర

గానమును మించినట్లు గానము చేయుచు దేవదాసీలు నృత్యమును జేయుచుండిరి. భూసురుల వేదఘోష శ్రావ్యముగ విన వచ్చుచుండెను. అగురుధూపముల సువాసన లెల్లెడల గుబాళించుచుండెను. భక్తులు రామభజనలను జేయుచుండిరి. వాహనము లూరేగుచుండెను. వింజామరములు విసరుచుండిరి. గర్భాలయము మిక్కిలి నేత్రోత్సవ మొనర్చుచుండెను. అచ్చట నమర్పఁబడిన బంగరు తూగుటుయ్యాలలో శ్రీసీతా రామలక్ష్మణుల విగ్రహములు సమస్తాభరణములతో నలంకరింపఁబడి మనోజ్ఞముగ నుండెను. మేళతాళములతో రథములును, వాహనములు నూరేగుచుండెను. ప్రజ లాదృశ్యముల జూచుచు నానందాబ్ధి నోలలాడుచుండిరి. ఇంతకంటె వైకుంఠ మెక్కువగ నుండునా యని యనుకొనసాగిరి.

గోపన్న బ్రహ్మానందముతో బ్రాహ్మణసమారాధనములు చేయుచుండెను. అనేక దానదక్షిణ లొసంగుచుండెను. ప్రజలందఱు నాదరించి యన్నివిధముల సత్కరించుచుండెను. అతఁడానాఁ డొసంగిన బహుమతులకు లెక్కలేదు. గోపన్న పేరు నల్దిశల మాఱుమ్రోగుచుండెను. అతని కీర్తికాంత స్వేచ్ఛా విహార మొనర్చుచుండెను. అతఁడు రామపాదారవింద ధ్యాన సమాధిలో మునిఁగి తేలుచుండెను.

ఉత్సవములు జయప్రదముగ జరిగిపోయెను. ఒకనాఁడు గోపన్న సావధానుఁడై కూర్చుండి భద్రాచల దేవాలయ నిర్మాణమునకై సర్కారు ధన మెంత తాను వ్యయపఱచెనో

లెక్కలు చూపించెను. మొత్తమాఱులక్షలకుఁ బైగా వ్యయ పడినట్లు తేలెను. గోపన్న నిశ్చేష్టుఁడయ్యెను. 'సర్కారు పైక మాఱులక్షల నెట్లు చెల్లింపఁ గల్గుదును? చేతఁ గాసైన లేని నిరుపేదనే! ఒకటా - రెండా - వందలా - వేలా - ఆరులక్ష లనిన సామాన్యమా? సర్కారుకుఁ దెలిసినచోఁ దానీషా నా కెట్టి శిక్ష విధించునో కదా! ఎట్టియాపద రానున్నదో కదా!' యని పరిపరివిధములఁ జింతించుచుఁ గానున్నది కాకమానదు కదా! ఇదియు శ్రీరామచంద్ర కైంకర్యమునకే సమర్పించితిని కదా! అన్నిటికి నా రామభద్రుఁడే మనపాలఁ గలఁడని యనుకొని ధైర్యమవలంబించి యుండెను.

## 5. బందిఖానా

"తాండవమున నఖిలాండకోటి బ్ర
హ్మాండనాయకా! రామా!
బంధనమున నీ నామముఁ దలచితె
బ్రహ్మానందము రామా!"

గోల్కొండలో తానీషాకు గోపన్న సర్కారు పైక మాఱు లక్షలను వ్యయపఱచి దేవాలయాదులు నిర్మించినట్లు తెలిసెను. అతఁడామాట వినినతోడనే మహోగ్రమూర్తియై మండిపడెను. అక్కన్న మాదన్న లీ మాటవిని నిశ్చేష్టులైరి. ఆఱులక్ష లనిన సామాన్యమా? వారుమాత్రము తానీషాతో

నేమని చెప్పి సమాధాన పరుపగలరు? అందుచే వారేమి యును జేయఁజాలక దైవనిర్ణయ మెట్లున్నదో యట్లగునని యెంచి యూరకుండిరి.

తానీషా వెంటనే కొందఱు సేవకులను బిలిపించెను. వారితో గోపన్న నెట్లున్న వానినట్లు సంకెలలువైచి తీసుకొని రమ్మని ఫర్మానా నిచ్చి భద్రాచలమునకుఁ బంపెను.

తానీషా యాజ్ఞానుసారము వారు భద్రాద్రిఁ జేరి గోపన్నకుఁ దానీషాగారి హుకుమును జూపిరి. గోపన్న హుకుమును జదువుకొని నిలువుఁగఁ గూలఁబడి పోయెను. అతఁ డనేక విధముల శ్రీరాముని దలఁచుకొని విచారించెను. ఏమిలాభము? వెంటనే తానీషా సేవకు లతనిని బంధించి గోల్కొండకుఁ దీసి కొనిపోయిరి. ఈవార్త విని యక్కన్నమాదన్నలు భద్రాచలములోనున్న గోపన్న భార్యాపుత్రులను రప్పించి తమయింట నుంచుకొని వారి కేలోటును లేకుండ జూచుచుండిరి. ఈవార్త వినిన భద్రాచలము తాలూకాలోని ప్రజ లందఱు ననేకవిధములఁ బరితపించిరి. తానీషా సేవకులు విచ్చుకత్తులతో పహారా నిచ్చుచు గోపన్నను గోల్కొండఁ గొనివచ్చి తానీషా యెదుట నిలువఁ బెట్టిరి. గోపన్న తానీషాకు నమస్కరించి యవనత ముఖుఁడై నిలువఁబడెను. తానీషా గోపన్నను జూచి కోపావేశముతో నిట్లనెను:

తా:—ఏమి గోపన్నా? ఆఱులక్షల రూకలను దెచ్చితివా?

గో :—లేదు ప్రభూ! తమద్రవ్యము తమ పేరు శాశ్వతముగ నుండునట్లు శ్రీభద్రశైలమున వెలసిన శ్రీరామునకు దివ్యమైన దేవాలయమును నిర్మించుటకై వ్యయముఁ జేసితిని. ఆకీర్తి యంతయును తమదే!

తా :—నిన్ను తహాశ్శీలుదారుగా నియమించితిమా! లేక జీర్ణ దేవాలయముల నుద్ధరించమని నియోగించితిమా?

గో :—లేదు ప్రభూ! కాని బాల్యమునుండియు రామభక్తుఁడ నగుటచే శ్రీరామచంద్రుని దివ్యక్షేత్రమగు భద్రాద్రి పైనున్న దేవాలయము శిథిలమై యుండుటఁ జూడఁ జాలక యీమహాకార్యమును దలపెట్టితిని. ప్రథమమున ప్రజలు కానుకలుగా సమర్పించిన ముప్పదివేల రూకలు సరిపోవు ననుకొని ప్రారంభించితిని. సగము పనియైన గాకుండగనే యాద్రవ్యమైపోయినది. ఆమహా కార్యము నట్టియసంపూర్తిస్థితిలో వదలి వేయఁ జాలక భక్త్యావేశముతో శ్రీవారి ద్రవ్యమును వాడుటకుఁ బ్రారంభించితిని. పని పూర్తియగుసరి కాఱులక్షలును వ్యయమైనవి. ఇంతకంటె నేనెట్టిద్రోహము నెఱుఁగను. నేనొక్క రాగికాసైన నందుండి యపహరించి యుండలేదు. అందుకు నాయేకైకపుత్రుఁడగు రఘు రామునిపై నొట్టుఁ బెట్టుకొనుచున్నాను. ఇదియే జరి గిన నిజమైన సంగతి. పైన తమ యనుగ్రహము.

తా :—ఇదియేమి? వందలా-వేలా-నిన్ను క్షమించుటకు. ఆఱు లక్షలును దేవాలయనిర్మాణమునకే వ్యయమయ్యెనా? ఐనను నీ వెవ్వరి యనుమతియు లేకుండ నాఱులక్షల రూకలు ఖర్చుపెట్టుటకే సాహసించితివే? నీ వెంతటి పనియైనను చేయుటకు వెనుదీయనివానివలె నున్నావు. నీ నక్కవినయములు నాకడఁ బనికిరావు. ఈవిధముగనే యందఱు తహశ్శీలుదారులును వారి యిచ్చవచ్చినరీతిని ప్రవర్తించినచో గోల్కొండరాజ్యము బాగుగనే వర్థిల్లును. చాలు! చాలు! నేనేమియు నమ్మఁజాలను. నీ దీనాలాపములు విననను. ఇచ్చెదవా యాఱులక్షలును వెంటనే ఖజానాకు జమ కట్టుము. లేనిచో యావజ్జీవమును సకలబాధల ననుభవించుచుఁ జెరసాలలో నుండవలసినదే! ఆలోచించుకొనుము.

గో :—మహాప్రభూ! శ్రీరామచంద్రుని కటాక్ష మట్లున్నది కాబోలును! తమ రేమి చేయుదురు? ప్రమాణ మొనర్చి మఱియొకసారి మనవిచేయుచున్నాను. నాచేతఁ గాసైన లేదు. పైన తమచిత్తము.

తా :—ఏమీ! ఎంత పెంకితనము. అటులైన నా శ్రీరామచంద్రునే రక్షింప వేడికొనుము. మేమేమియుఁ జేయఁజాలము. "సేవకులారా! ఇతని నూరంతయుఁ ద్రిప్పి సర్కారుపైక మాఱులక్షలును దన యిచ్చవచ్చినట్లు ఖర్చుపెట్టుటచే నీ భద్రాచలము తహశ్శీలుదారుగా

నుండిన గోపన్నకు సొమ్ము చెల్లించువఱకు చెఱసాలలో నుండునట్లు మేము శిక్ష విధించితి మని ప్రకటించుచుఁ దీసికొనిపోయి చెఱయం దుంచుడు. సొమ్ము చెల్లించు వఱకును కఠినముగ శిక్షింపుమని చెఱసాలాధికారితో నా యాజ్ఞగాఁ జెప్పుడు పొం" డనెను.

గోపన్నను తత్క్షణమే భటులు లావలకుఁ గొనిపోయిరి. గోపన్న తానీషాకు నమస్కరించి మఱి కదలెను. సేవకులు గోపన్నను బురమంతయుఁ దానీషా యాజ్ఞానుసారముగఁ ద్రిప్పి చెఱసాలయం దుంచిరి.

గోపన్న శ్రీకృష్ణజన్మస్థానమగు చెఱసాల నలంకరించెను. అతఁడు నిలువుబేడీలతోఁ జీకటిగదియగు నాబంధిఖానాలోఁబడి శ్రీరామచంద్రునిగూర్చి పరిపరివిధముల మొఱ లిడసాగెను. "శ్రీరామచంద్రా! భద్రాద్రివాసా! తండ్రీ! ఆర్తత్రాణపరాయణా! దీనచింతామణీ! భక్తరక్షామణీ! నాకీమహాకష్టము నెందులకైఁ బ్రసాదించితివి. తండ్రీ! బాల్యమునుండియు నాకు నీపై నెందు కింతభక్తి యలవడఁ జేసితివి? నాసర్వస్వమును నీపాదసేవకే సమర్పించితినే! నీవే తల్లివని—తండ్రివని—సర్వమునని భావించితినే! నీపాదారవిందసేవతప్ప నన్యమెఱుఁగనే! నిత్యమును నీనామసంకీర్తన సుధారసమును గ్రోలుచు తనివి నొందితినే! నీకళ్యాణమహోత్సవములు చేసికొనుచు—నీభజనలు చేసికొనుచు—నీదివ్యకథాశ్రవణమందు లీనమగుచు—దినములఁ బుచ్చికొనుచుంటినే? అట్టి నాకేల యీశిక్ష విధిం

చితివి ? తండ్రీ! నా కీ తహాశ్శీలుదారుపదవి నెందుల కిప్పించితివి? నా పుత్రుని ప్రాణదానమును జేసి యేల నాచే నీ దేవాలయ పునర్నిర్మాణ మొనర్పఁబడు వాగ్దానమును జేయించుకొంటివి ? నీ దేవాలయ పునర్నిర్మాణోత్సాహము నా కేల కలుగఁ జేసి తివి ? అది నిర్మించుట కింతపైక మెందులకు ఖర్చగునట్లొనర్చి తివి ? తుదకు నా కీ యవస్థ నెందులకుఁ గలిగించితివి ? రామ చంద్రా ! నీ యభిప్రాయము నా కవగాహన యగుట లేదు. నన్ను బాగుచేయ నెంచితివో ? పాడుచేయ నెంచితివో ? నాకుఁ దెలియుట లేదు. నా మనసాందోళనమున్తోఁ గొట్టుకొనిపోవు చున్నది. నా భార్యాపుత్రు లెట్లు నాకై విలపించుచున్నారో కదా ! వారి కేది దిక్కు ! తండ్రీ ! అన్నిటికిని నిన్నె నమ్ము కొనినందులకు నా కిదా ప్రతిఫలము ? ఆపద్బాంధవా ? కరుణా నిధీ ! నన్ను రక్షింపవా ! దయ లేదా ! స్వామీ ! అనాధనాధా! దయాసముద్రా ! నాపైఁ గరుణించవా! నీ దాసానుదాసుఁడను. నీ పాదారవిందములే నమ్మినవాఁడను” అని యింక నేమేమో యనుచు గోపన్న మూర్ఛలోఁ బడిపోయెను.

మఱునాటి యుదయమునఁ గారాగారాధికారియును, గొందఱు సేవకులును వచ్చి గోపన్న యున్న చెఱసాల తలుపులు తెఱచిరి. గోపన్న నీవలకుఁ గొనివచ్చిరి. అతనిచే బండరాళ్ళను మోయింపసాగిరి. ఎన్నఁడు నెట్టిబరువును మోసి యెఱుఁగని గోపన్నకు బండరాళ్ళను మోయవలసినగతి పట్టెను. అతఁ డమిత బాధఁ బడుచు, “శ్రీరామచంద్రా !” యనుకొనుచు

నా రాళ్ళను మోయసాగెను. ఆ రాళ్ళను సరిగ మోయలేనప్పు డాభటు లాడు నిష్ఠురవాక్యములను — నిందావాక్యములను — తుద కొరడాదెబ్బలను దండనములుకూడ నా రామభక్తుఁడు పడుచుండెను. ఇట్లు గోపన్న గారు మధ్యాహ్నమువఱకో రాళ్ళు మోసిమోసి యప్పు డింతపచ్చడి, అన్నమును వండుకొని తిను చుండెను. తిరుగ మధ్యాహ్నముకూడ వారు చెప్పినపనిని జేయుచు సాయంత్ర మగుసరికిఁ దిరుగ నాచీకఁటికొట్టులో బంది రాతి నేలపై నిలువుబేడీలతోఁ బండుకొనవలసియుండెను. తానీషా యాజ్ఞానుసారము చెరసాలయందలి భటులు గోపన్న ననేకవిధ ములఁ గష్టపెట్టుచుండిరి. అయినప్పటికిని భక్తాగ్రేసరుఁడగు గోపన్న యా కష్టములన్నియు ననుభవించుచు రామనామ సంకీర్తనము మాత్రము మానలేదు. అతఁడా రామసంకీర్తనము వలనఁ గలుగు నానందములో — తన్మయత్వములో — నీ కష్ట ములను మఱచిపోవుచునే యుండెను.

ఇట్లుఁ గొంతకాలము గడచుసరి కాబాధలకు గోపన్న యలవాటుపడిపోయెను. మఱికొన్నాళ్ళకుఁ దానీషా కారాగా రాధిపతిని బిలిపించి గోపన్నస్థితి యెట్లున్నదని యడిగెను. అంత నాతఁడు 'ప్రభూ! ఇంతకాలమునుండి యీ యుద్యోగమును జేయుచుంటిని కాని యిట్టివాని దీని నే నెన్నఁడును జూచియుండ లేదు. అతఁ డెన్నికష్టములు పెట్టినను రామనామస్మరణము తప్ప యన్యముచ్చరింపడు. మిమ్ముకాని మమ్ముకాని యేకాం తమునసైన నిందింపడు. ఎల్లప్పుడు నా రామనామ సంకీర్తనమే

చేసికొనుచుండును. ఒకప్పుడు పిచ్చివానివలె తనలోఁ దానె నవ్వుకొనుచుండును. మఱొకప్పు డేడ్చుచుండును. ఇంకొకప్పుడు మూర్ఛ నొందుచుండును. నా కాతని జూచిన వింతగనున్న' దని మనవి చేసికొనెను.

తానీషా కీమాటలు రుచింపలేదు. గోపన్న తన్ను మాయఁ జేయుటకై యిట్లు ప్రవర్తించుచున్నాఁ డనుకొని తానీషా మఱెంత యుగ్రుఁ డయ్యెను. కారాగారాధిపతితో గోపన్న సింకను కష్టపెట్టుమని నుడివెను. రాజవీదులలోఁ జెట్లకుఁ గట్టిపెట్టి కొరడాలతోఁ గొట్టింపు మనెను. మిట్ట మధ్యాహ్నమప్పు డెండకుఁ గాలుచుండు నిసుకలో గంటల కొలఁది నిలఁబెట్టుమనెను. మోయలేనంత బరువుగల యినుప గుండును వీపుపైఁ బెట్టి నగర మంతయుఁ ద్రిప్పు మనెను. ఇట్లే యొకటి వెనుక నింకొకటిగ ననేకవిధముల గోపన్నను బాధింపు మని యాజ్ఞాపించెను. ఎప్పటి కప్పు డాతనిస్థితిఁ దన కెఱిగించు చుండుమని యానతిచ్చెను.

మఱునాటి నుండి చెఱసాలాధికారియు, సేవకులును, గోపన్న నా విధముగఁ బలుకష్టములు బెట్టసాగిరి. గోపన్న యా బాధల కాగలేక మూర్ఛఁ బోవుచుండువాఁడు. అంతవఱకు నాతని ననేకవిధముల బాధపెట్టి మూర్ఛపోయినవెంటనే యా భటులుకూడ జాలిఁ జెంది గోపన్నను మోసికొనిపోయి యతని చెఱసాలలో వదలివేయు చుండువారు. ఇట్లు గోపన్న పడు బాధల కంతు లేకుండెను. అతఁడు శ్రీరామచంద్రుని దలఁచు

కొని పెట్టుమొత్తలకు విధివిరామములు లేకుండెను. దినములు-మాసములు - సంవత్సరములు గూడ నిట్లే గడచుచుండెను. గోపన్న తన చెఱసాలలోనుండి 'శ్రీరామచంద్రా! ఆర్తరక్షా మణీ! దీనచింతామణీ! నీవు దివ్యమైన దేవాలయమున దుండి నాకీ చెఱసాలనివాస మేర్పరచితివా? నీవు రమ్యమగు వాహనములపై నూరేగుచు నాచే బండరాళ్ళను మోయించు చున్నావా? నీవు మహారథములపై నూరేగుచు నావీపుపై నినుపగుండుతో వాడవాడలఁ ద్రిప్పించుచున్నావా? నీ కపూర్వాభరణములును నాకినుప సంకెలలునా? నీకు హంస తూలికాతల్పములును నాకుఁ గటికరాతినేల పడకయునా? నీకు మధురాన్న నైవేద్యములును, నాకుఁ బచ్చడి మెతుకులునా? నీకు భక్తులు సమర్పించు నిత్యకాన్కలును, మంగళహారతులును, నాకు మండుటెండలోఁ గొరడాదెబ్బలునా!

'తండ్రీ! ఇదియేనా నీ భక్తవాత్సల్యత? ఇదియేనా నీ దయాపరత్వము? కరుణానిధీ! నీ భక్తులను బ్రోచు టిదియేనా? భక్తమందారమవని, భక్తపోషకుఁడవని, భక్తరక్షకుఁడ వని యనేకవిధముల నిన్నుఁ బ్రస్తుతింతురే! భక్తుల నీ విధముగనే రక్షించుచుంటివా? తండ్రీ! నిన్నననేల? ఇది యంతయు నా పురాకృత కర్మఫలిత మేమో? అటులయినను తండ్రీ! నీవు నన్నీ కష్టములనుండి రక్షింపలేనిచో శీఘ్రముగ నా ప్రాణము లెగిరి పోవునట్లు చేసి నాకు శాశ్వతానందసుఖ మొసంగరాదా? రామచంద్రా! ఎన్నాళ్ళని నే నీ బాధల ననుభవింపను. ఈ

బాధల ననుభవింప లేనోయి తండ్రీ! రామభద్రా! భద్రాద్రి వాసా!' యని పరిపరివిధముల రామచంద్రుని ప్రార్థించుచు గొంతతడవునకు నిదుర పోవుచుండువాఁడు.

ఒకనాఁడు గోపన్నకుఁ జెఱసాలలోఁ జేలుకుట్టెను. మఱొకనాఁడు శూలనొప్పి వచ్చెను. "అధికారులు నిత్యమును బెట్టు బాధలకుఁ దోడుగ నీబాధలుకూడ కల్పింపవలెనా? రామ చంద్రా! ఎన్నికష్టములు పెట్టినను, నీ కింకను నాపై దయ కల్గుట లేదా? రామభద్రా! ఎంత వేడినను నీ హృదయము కరుగ కున్నదా? తండ్రీ! ఇఁక నే నీ జన్మమున భద్రాద్రి వచ్చి నీదివ్య దర్శనముఁ జేసికొనుభాగ్యము లేనేలేదా? నాభార్యాపుత్రు లేమి యిక్కట్టులఁ బడుచున్నారోకదా! నే నిఁక వారి నీజన్మ మునఁ జూచుకొనుయోగము లేదేమో! నారఘురాముఁడు నాకై యెంత బెంగపెట్టుకొనినాఁడో? నాయిల్లాలు నాకై యెంత పరితపించుచున్నదో? తండ్రీ! ఆపదుద్ధారకా! కరిరాజు నేలితి వట! ద్రౌపదీమానసంరక్షణమును జేసితివట! ప్రహ్లా దుని గాచితి వట! పండితరక్షకుఁడ వట! అఖిలపాపవిమోచ నుఁడ వట! ఇవన్నియుఁ గల్లలేనా! తండ్రీ! నాయాపదల కడ్డు పడవా? నాయాలాపనల నాలకించవా? నన్ను రక్షింపవా?" యని యనేకవిధముల గోపన్న శ్రీరామచంద్రునితో మొఱ లిడుకొనుచుఁ దాను బడుచున్న బాధల నాప్రార్థనలలో మఱ చుచు దినములఁ బుచ్చుచుండెను.

ఇట్లే కాలమును గడపుచుండెను. సంవత్సరములకు సంవత్సరములే గడచిపోవుచుండెను. గోపన్నను పెట్టుబాధల కంతు లేకుండెను. గోపన్న భక్తి కూడ నట్లే యతిశయించుచుండెను. అతని రామనామ సంకీర్తనమును విని, యితర ఖైదీలును, చెఱసాల నౌకరులు కూడ నానందతరంగితాత్ములై పోవుచుండిరి. క్రమక్రమముగ వారందఱును కూడ రామభక్తులై పోయిరి. అందఱును రామనామసంస్మరణమే చేయసాగిరి. చెఱసాల యంతయు నెల్లప్పుడును రామనామస్మరణతో మారుమ్రోగసాగెను. వేయేల! చెఱసాలయే రామమందిర మయ్యెను. ఈ వింత తానీషాకుఁ దెలిసెను. అతఁ డాశ్చర్యపడెను. ఇట్లున్న లాభము లేదని యాతఁడు చెఱసాలకుఁ గ్రొత్తనౌకరులను నియమించి, ఖైదీల నందఱను వేరొక చెఱసాలకు మార్పించెను. ఇన్ని యేర్పాటులు చేయుచున్నను తానీషా కూడ యొక్కొకప్పుడు "నిష్కారణముగ నొకసాధువర్తనుని - మహాభక్తుని - కష్టపెట్టుచున్నానేమో! అతఁడు నిజముగా నిరపరాధియేమో! మనపై కతఁ డేమియు దాచుకొనలేదేమో! లేనిచో సంవత్సరములకొలఁది యీ బాధల నోర్వగలడా." యని యనుకొనుచుండువాఁడు. తిరుగ ననుమానమును బడుచుండువాఁడు. ఇట్లే కాలముఁ గడచుచుండెను.

గోపన్న బందిఖానాలో శ్రీరామచంద్రుని స్తోత్రమును జేసి చేసి విసిగిపోయెను. పన్నెండు సంవత్సరము లయ్యెను. ఇంకను తనకు బంధవిముక్తి కలుగ లేదు. ఇంకను శ్రీరామ

చంద్రునికిఁ దనపై దయ కలుగలేదు. అతఁ డింక నోపికఁ బట్ట లేకపోయెను. మానవస్వభావము నుద్రేకముతో నాతఁ డొక నాఁడు శ్రీరాము నుద్దేశించి—

"మ. అతికాఠిన్యుఁడ వీవు నిక్కముగ న
త్యాపన్నుఁడ న్నేను నీ
మతిలో నించుక జాలి పుట్ట దిఁక నే
నేడ్వుఁ జింతింతు నే
గతి నేత్రోవఁ జరింతు నన్యు మెఱుఁగ
న్గాంక్షించి నీప్రాపుఁ జొ
చ్చితి నీచిత్తము యెట్లు వచ్చిన నరే
శ్రీభావనారాయణా."

యని రామునిపైఁ గినుక వహించి, యిఁక సీతాదేవిని బ్రార్థింపసాగెను—

"అమ్మా! నను బ్రోవవే - రఘురాముని
కొమ్మా! నను గావవే
అమ్మా నను బ్రోవు సమ్మతితోడ మా
యమ్మ వనుచు నిన్ను నెమ్మదిఁ గొలిచెద నమ్మా."

'తల్లీ! సీతమ్మతల్లీ! పన్నెండుసంవత్సరముల నుండియు నీనాథుని బ్రార్థించుచుంటిని. అంతటి కఠినహృదయుఁ డుండఁ బోఁడు. ఇంతవఱకు నాపై నిసుమంతైన దయఁ జూపఁడు. నాదీనాలాపములు — నామొఱలు — నాప్రార్థనలును యడవిని గాచిన వెన్నెలవలె వృథయై పోయినవి. తల్లీ! నీవైన నాపై

నవ్యాజానురాగము నుంచి నీనాథుని పాదసేవకుఁడవగు నాపై ననుగ్రహ ముంచి నీనాథునితో నేసమయమున నెట్లుఁ జెప్ప వలయునో యట్లు నాయనుతాపమును దెలియఁ జేసి నన్ను రక్షించునట్లుఁ జేయుభారము నీదే! అమ్మా! నీవును నావలె ననేకకష్టము లనుభవించితివి. అందుచే నాకష్టానుభవము నీకు బాగుగఁ దెలియును. నావంటిభక్తు నిట్లుఁ గష్టపెట్టుటఁ బాడి గాదని నీనాథునితోఁ జెప్పుము. సర్వస్వము నతని సేవకై వెచ్చించి, యాత్మార్పణముఁ జేసి నిత్యమును దన నామస్మరణమే చేసికొనుచున్న నావంటిదీనుని యుసురుఁ బెట్టు టధర్మమని చెప్పుము. శరణాగతరక్షణకుఁ బేర్గాంచిన రఘువంశమున కపకీర్తిఁ గలుగనీయ వలదనుము. నన్ను రక్షింపకున్నచోఁ గలియుగమునఁ బ్రజ లిఁక దేవుఁడే లేఁడని నిశ్చయించుకొందు రనుము. ఆయులక్షల పైకముతోఁ దనదేవాలయాదులు నిర్మింపఁజేసికొని నన్నిట్టికష్టముల పాల్జేయుట తనకీర్తికే భంగకరమనుము. నాతప్పేమియును లేదనుము. ఇఁక నైన నన్ను బ్రోవు మనుము. నీవైన నీ దీనుని మొఱ యాలకించి తత్క్షణమే రక్షింపకున్నచో నేఁ బ్రతుకజాలను. నీవుకూడ నుపేక్షఁ జేసినచో నేఁడో రేపో విషముఁ ద్రావి యసువులఁ బాసెదను. నీపాదములాన. పైన నీచిత్తము. నాయదృష్టము' ననుకొనుచు గోపన్న నిదురపోయెను.

ఆరాత్రి గోపన్న కొకదివ్యమైన స్వప్నము వచ్చెను. సీతాదేవి శ్రీరామచంద్రునితోఁ దన్నుగూర్చి చెప్పి తన్నుఁ

తత్‌క్షణమే రక్షింపుమని కోరినట్లును, శ్రీరామచంద్రుండు 'అయ్యో! పన్నెండేండ్లనుండి నాభక్తుఁడు చెఱయందుండి కష్టపడుచున్నాఁడా? ఇంతకాలము వఱకును నీవైన నేలఁ జెప్ప వైతి' వని, త్వరలోనే తన్ను రక్షింతునని వాగ్దానమును జేసి నట్లును గోపన్న కలఁ గనుచుండెను. ఇంతలో గోపన్నకుఁ దెలివి వచ్చెను. గోపన్న యాకలఁ దలఁచుకొని యానందపడెను. తెల్లవారెను.

మఱునాఁడుకూడ గోపన్న యథాప్రకారమే కష్టపడెను. చీకఁటిపడెను. ఆరాత్రి తిరిగి గోపన్న సీతాదేవిని మఱిమఱివేడి కొనెను. 'తల్లీ! నీకుఁగూడ నాపై దయ కల్గినట్లుఁ దోచదు, ఈదిన మంతయు మిగులఁ గష్టపడితిని. నాబాధలకంతమున్నట్లు దోచుటలేదు. నాప్రారబ్ధమింతియే యనుకొందును. వృథగా నింతకాలము నీకఠినహృదయుఁడగు దేవుని గొలిచితిని. ఇఁక నే జీవించియున్న లాభములేదు. తానీషా బ్రతికియున్నంతకాల మును వదలఁడు; రాముఁడు రక్షింపఁడు. ఇక నేజీవించియున్న లాభమేమి? ఈదినమే నాజీవితములోఁ దుది దినము. శ్రీరామ చంద్రా! పోనిమ్ము! నీమాట నీకే యుండును. నీనామస్మరణముఁ జేయుచు నేను ప్రాణములను విడిచెదను. ఇదిగో! విషము సంపా దించి గిన్నెలో నుంచుకొంటిని.' అనుచుఁ గొంత తడవు శ్రీరామనామసంకీర్తన మొనర్చి యట్లే యాభక్తిపారవశ్య ముతో నొడలు మఱచి గోపన్న నిదురఁ జెందెను.

ఇది యిట్లుండ ఆరాత్రి తానీషా ప్రొద్దుపోవువరకును గోపన్నవిషయమై యాలోచించి తుదకు గోపన్న నిరపరాధి యని నిశ్చయించుకొని, యట్టిమహాభక్తుని దండించుట మహాపాపమని యనుకొని మఱునాఁ డాతనిని వదలివేయుటకు స్థిరపరచుకొని నిద్రించెను. మరికొంతసేపటికిఁ దానీషా కొక స్వప్నము వచ్చెను. ఆస్వప్నములో శ్రీరామలక్ష్మణులు వచ్చి తానీషాతో "మేము రామదాసుగారు మీకీయవలసిన యాఱులక్షల రూకలను దెచ్చినాము. ఇవిగో! ధనఁపుసంచులు. లెక్కపెట్టుకొని రసీ దిండు. మేము తెల్లవారకుండగనే రామదాసుని విడిపించుకొని పోవలసి యున్నది. ఒక్కనిముషమైన మేము నిలుచుటకు వీలు లే"దనిరి. కన్నులు మిఱుమిట్లుఁ గొల్పుచుండఁ దానీషా యాదివ్యసుందరవిగ్రహులగు శ్రీరామలక్ష్మణులను జూచి "మీ పే రెవరు? రామదా సెవరు? తెల్లవారిన పిమ్మటగాని మే మాధనమును లెక్కఁ జూచుకొని రసీదిచ్చుటకు వీలు లే"దనెను.

శ్రీరాముఁడు :—ఒక్క నిముషమైన మే ముండుటకు వీలు లేదని ముందుగనే చెప్పియుంటిమి. "ఇతనిని 'లక్ష్మోజీ' యందురు. నన్ను 'రామోజీ' యందురు. మానివాసము భద్రాచలము. రామదాసనగా గోపన్నయే. ఈధనమును మీరిప్పుడు లెక్కపెట్టుకొనలేనిచో మాలక్ష్మోజీ మీయెదుటనే లెక్కబెట్టు" ననుచు లక్ష్మోజీచే నాఱులక్షల రూకలను లెక్కపెట్టించి వప్పఁజెప్పెను. తానీషా నివ్వెఱఁబడి చూచుచు, ధగధగ

మెఱయుచున్న యా నాణెముల రాసులఁ గాంచి యాశ్చర్య పడుచు, వెంటనే వారికి రసీదిచ్చివేసెను. తత్క్షణమే వారిరువురు నదృశ్యులైరి. తానీషా కంతలో మెలఁకువ వచ్చెను. అతఁడు తత్తరముతో భార్యను లేపి యామెతో నా వృత్తాంతమును జెప్పెను. ఆమె "నాథా! నీవదృష్టవంతుఁడవు. నీకు శ్రీరామలక్ష్మణుల దివ్యదర్శన మైనది. గోపన్న మహాభక్తుఁడనియు, నతనిని బాధించుట మహాపాప మనియు, తత్క్షణమే విడుదలఁ జేయుఁ డనియు నే ననేకసారు లిదివఱకే చెప్పియున్నా" ననెను. తానీషాదంపతు లా స్వప్నమును దలఁచుకొనుచుఁ దెల్లవారువఱకును శ్రీరామచంద్రుని మహిమ కాశ్చర్యఁబడుచుఁ గాలక్షేపముఁ జేసిరి.

ఇది యిట్లుండఁ జెఱసాలలో రామనామసంకీర్తనముఁ జేసి చేసి యొడలు మఱచి నిద్రించిన రామదాసునకుఁ గూడ నొక స్వప్నము వచ్చెను. ఆ స్వప్నములో నెవరో "సోదరా! ఆ గిన్నెలోని విసముఁ బాఱఁబోయుము. అతని సంకెలలు తీసివేయుము." అను మాటలును, "గోపన్నా! ఆరులక్షలు నిప్పుడే తానీషాకుఁ జెల్లించి రశీదుఁ దెచ్చితిమి. ఇదిగో! రసీదుఁ గైకొనుము." అను మాటలును వినఁబడెను. ఇంతలో గోపన్నకు మెలఁకువ వచ్చెను. అతఁడు చూచుసరికి గిన్నెలోని విసమొలికిపోయియుండెను. అంత గోపన్న యది యంతయు శ్రీరామచంద్రుని లీలయే యనుకొని యాశ్చర్యపడి "శ్రీరామచంద్రా! దయాసాంద్రా! నేటికి నా పై దయఁ గల్గినదా? నేటికి

నా కష్టములు గట్టెక్కెనా? సీతమ్మతల్లి నిన్నిప్పటికిఁ బంపి నదా? తండ్రీ! ఎంతకష్టపడితివి? నా కొఱకై నీవే స్వయముగా లక్ష్మణసహితుఁడవై వచ్చితివా? ఆపదుద్ధారకా! దీనరక్షకా! ఒకలు తెలియక బుద్ధిపూర్వకముగను, ప్రమాదవశమునను కూడ నిన్ను నిందించినందులకు క్షమింప వేఁడుచున్నాను. ఈ దీనుని బ్రోచుభారము నీదే! తండ్రీ! నీమహిమఁ గొనియాడఁ గలనా! రామచంద్రప్రభూ! యనుచు గోపన్న నిమీలితనేత్రుఁడై, తన్మయత్వముతో శ్రీరామచంద్రుని ననేకరీతులఁ గొనియాడుచుండెను. అంతలోఁ దెల్లవాఱెను. బాలభానుని కిరణము లాచెఱసాల కవాటముల దాటి గోపన్నశరీరముపైఁ బడి ప్రకాశించుచుండెను.

ఇంతలోఁ జెఱసాలతలుపులు దెఱచుచున్నధ్వని గోపన్న చెవులఁ బడెను. అతఁడు కండ్లుఁ దెఱచెను. ఎదుట నక్కన్న మాదన్నలును - అనేక సంస్థానోద్యోగులును - సేవకులును - ప్రజలును గాన్పించిరి. ఇది కలయా - మాయయా - యని గోపన్న యాశ్చర్యపడుచుండెను. అతఁ డట్లె నివ్వెఱపడి చూచుచుండగనే అక్కన్నమాదన్నలు గోపన్నను కౌగలించుకొని "నాయనా! గోపన్నా! నేటితో నీ కష్టములు గట్టెక్కినవి. నేటికి నీ రాముఁనికి నీపై దయ కలిగినది. నీ వదృష్టవంతుఁడవు. తానీషాగారు నీవు నిరపరాధివని నిన్ను విడుదలఁ జేయుటకు నేఁడుదయముననే యాజ్ఞాపించిరి. ర॥మ్మని యతనిని దీసికొని సిద్ధముగనున్న గుఱ్ఱపుబండిలో నెక్కించుకొని యక్కన్న

మాదన్నలు చెరియొక వైపునఁ గూర్చుండి తమయింటికిఁ గొంపోయిరి.

దారిపొడుగున ననేక జనులు గోపన్నను చూచుటకై తహతహపడుచుఁ దండోపతండములుగ వీధులు క్రిక్కిరిసిపోవు నట్లు చేరి గోపన్నదర్శనముఁ జేసికొని ధన్యులైరి. అక్కన్న మాదన్నగార్ల గృహముకడ బండి యాగుటతోడనే వారిరాకకై వేచియున్న గోపన్నభార్య కమలాంబయు, మాదన్నగారి సతీ మణి మహాలక్ష్మీదేవియును మహదానందముతో గోపన్నకు మంగళహారతి నొసంగి లోనికిఁ గొంపోయిరి. అప్పటికిఁ బదు నాలుగేండ్లవాఁడగు రఘురాముఁడు పరుగు పరుగున వచ్చి తండ్రిపాదములపై వ్రాలెను. గోపన్న కుమారుని గౌగలించు కొని యానందాశ్రువులతో నాతనిని ముద్దిడికొని పన్నెండేండ్లకుఁ దిరిగి చూచుభాగ్యము లభించినదికదా యని యా బాలు నెత్తి కొని మురిసిపోవుచుండెను. పతివ్రతాతిలకమగు కమలాంబయు నాయానందసమయమున భర్తచెంతఁ జేరి యతని చరణకమల ములు కన్నుల కద్దుకొని యతనిపాదసేవఁ జేయుచు నా తండ్రి కొడుకుల ప్రేమాలింగనదృశ్యముఁ జూచుచు నానందరసతరంగి తాత్మురా లగుచుండెను.

మఱికొంతసేపటికి గోపన్నచే నభ్యంగనస్నానముఁ జేయించి, శుభ్రవస్త్రములు ధరింపఁ జేసి దివ్యఫలరసాన్నము లతో భోజనమిడి, విశ్రాంతిమందిరమునఁ గొంతవడు సక్కన్న మాదన్న లిష్టాగోష్ఠిని ముచ్చటింపసాగిరి.

ఆ సమయమున తానీషాకడనుండి యొక ముఖ్య సేవకుఁ డరుదెంచి, యక్కన్నగారి కొకహుకుము నందించెను. అది చదివికొని యక్కన్నగారు "గోపన్నా! తానీషాగారి సెలవై నది. మన మిప్పుడే వారిదర్శనమున కేగవలసియున్న" దనిరి. మాదన్నగారు సేవకునితో గుఱ్ఱపుబండిని సిద్ధపరుప మనిరి. వా రిరువురు నా బండిలో గోపన్న కిరువైపులఁ గూర్చుండి బైలుదేరిరి. తిరిగి దారిపోడుగునను ప్రజలు గోపన్నకు జయ జయధ్వానములు చేసిరి. బండి తానీషా సభామందిరమును సమీపించుచుండెను.

ఆ నాఁడు తానీషాదర్బారు సంస్థానోద్యోగు లందరితోడను, పురప్రముఖులతోడను, ప్రజలతోడను నిండియుండెను. తానీషా తగటుతలకుపై సుఖాసీనుఁడై గోపన్న నెప్పుడు చూతునా యని తహతహపడుచుండెను. ఇంతలో ద్వారము కడ గోపన్న బండి యాగెను. ప్రజల జయజయధ్వానములుమిన్ను ముట్టెను. వెంటనే తానీషా పాదచారియై ద్వారముకడ కేఁగు దేగి, గోపన్నకు నమస్కరించి సగౌరవముగ నాతనిని తిన్నగా సభాశాల దాటించి కొంపోయి తన యభ్యంతర మందిరమునకుఁ దీసికొనిపోవుచుండెను. సభామందిరములో నున్నవారందఱును లేచి, గోపన్నకు నమస్కరించి, యతనిదర్శనభాగ్యము కలిగి నందుకు సంతసించిరి. గోపన్న వా రందరిని "శ్రీరామచంద్ర దర్శనప్రాప్తిరస్తు" అని దీవించుచు తానీషాతో నభ్యంతర మందిరమునకు వెడలిపోయెను.

అభ్యంతరమందిరములోఁ దానీషా గోపన్న లిరువురే యుండిరి. గోపన్న యానందాతిరేకముతోఁ దనయాంతరంగమున శ్రీరామచంద్రుని దలఁచుకొని "తండ్రీ! నీలీల లత్యద్భుతములు! నిన్న నీసరికి బండరాళ్ళను మోయుచుంటిని. నేఁడీ ఘనగౌరవమును బ్రసాదించితివి. అందుకు విచారింపనా? ఇందుకు సంతసింపనా? తండ్రీ? అన్నిటికిని నీదేభారమని నమ్మియుంటిని. భక్తకల్పద్రుమా! నాకు నీయందే శాశ్వతమగు భక్తినిఁ బ్రసాదించి, నన్నుఁ దరింపఁ జేయు" మనుకొనుచుండెను.

తానీషాయును, ఆనందాశ్రువులు తనచెక్కులపై నొలుకుచుండ రాత్రికనిన స్వప్నమందలి శ్రీరామలక్ష్మణుల దివ్యదర్శన మింకను గన్నులకుఁ గట్టినట్లుండ, కొంతవడి గోపన్న నట్లే చూచుచు, నానందసమాధినుండి వీడక గోపన్న హస్తద్వయమును బట్టుకొని, "గోపన్నా! నేను నీకుఁ దీఱని యపకృతి నొనర్చిన మహాపాపిని? నీవు మోసగాఁడ వని యెంచి నిన్న నేకవిధముల బాధ పెట్టితిని. అక్కన్నమాదన్నల యానన్త్యమును జూచి సహింపలేని నాయితరమంత్రులు నీపైఁ జెప్పిన కొండెములు విని విశ్వసించితిని. ఆచెప్పుడుమాటలు వినుటయే యింతకును గారణమైనది. నీయిలవేల్పగు శ్రీరాముఁడు, లక్ష్మణసహితుఁడై నిన్నరాత్రి నాకలలోఁ గన్పించి నన్నుఁ గృతార్థుని జేసినాఁడు. వారియప్పటిదివ్యదర్శన మింకను నాకండ్లకుఁ గట్టినట్లే గన్పించుచున్నది. వారు నీవు మాకీయ

వలసిన యాటులక్షలు నిచ్చివైచి నావల్ల రసీదును బొందిరి. అంతలో నాకు మెలఁకువ వచ్చినది. అప్పటికిఁ దెలతెలవారు చుండెను. తక్షణమే నేను లేచి నీవిముదల కాజ్ఞ నొసంగితిని. నేను నీమెడఁ దెలియక యొనర్చిన యపరాధమును మన్నింప వేడుచున్నాను. నీవు మహాభక్తాగ్రేసరుఁడవని - సత్యవ్రతుఁడ వని - నిష్కల్మషహృదయుఁడవని - శ్రీరామచంద్రప్రియభక్తుఁడ వని నేటికిఁ దెలిసికొంటిని. నిన్ను హింసఁబెట్టిన నాపాపము క్షంతవ్యము కాదు. ఐనను నేరక చేసిన పాపమును నీవనుగ్ర హించి క్షమించినగాని నాకు ముక్తి లేదు. నీ కాజన్మాంత మును - పుత్రపౌత్రపారంపర్యమును శ్రీరామచంద్ర చరణసేవఁ జేసుకొనుచు సుఖముగ ననుభవించుటకై భద్రాచలము తాలూకా నంతను నామనఃపూర్వకముగ జాగీరుగా నొసంగు చున్నాను. ఇదిగో! దానపత్రము. నాయందనుగ్రహముంచి, నన్ను క్షమించినచో దీని నంగీకరింపకఁ దప్పదు. నన్ను నీయనుఁగుసోదరునిగా భావించి క్షమింపుము. నీకివే నాకృత జ్ఞతానేకవందనము" లనుచు తానీషా గోపన్నకా దానపత్రము నొసంగెను.

ఇంత తడవును గోపన్న నిమీలితనేత్రుఁడై తానీషా పలుకులు వినుచుండెను. అతని మన సంతయు శ్రీరామచం ద్రునిపై లగ్నమై యుండెను. అతఁ డానందబాష్పములు కపోలములపై జాలువారుచుండ తానీషాను జూచి ప్రభూ! నేను నిక్కముగ శ్రీరామచంద్రమూర్తిని నిజదైవముగను,

మిమ్ముల నపరాధులనుగను భావించుకొని యున్నాను. మీపై నాకెన్నఁడు నాగ్రహము లేదు. ఈనాకష్టములకు మీరెంత మాత్రమును బాధ్యులరు కారు. కష్టపెట్టినను - సుఖపెట్టినను నారాముఁడే కారకుఁడు. ఇంతకష్టపెట్టుటచేతనే నాభక్తి కీస్థిరత్వ మేర్పడినది. నారామునకు నాపై దయ కలిగినది. ఈనాకీర్తి కంతకును మీరే కారణులు. ఈ నానిశ్చలభక్తికిని మీరే కారణులు. అందుకు నాకృతజ్ఞతానేక వందనములు. మీరు నిష్కల్మషహృదయులని నే నెఱుంగుదును. పూర్వజన్మమున మీరు మహాతపశ్శాలురు. మీధనము భగవత్కైంకర్యము నకై యుపయోగపడినది. అందువలననే నాకైన నింతవఱకు దర్శనభాగ్యముఁ గలుగఁ జేయని నారామచంద్రుఁడు మీకుఁ దనదివ్యదర్శన మొసంగెను. మీరు మహాధన్యాత్ములు. మీపై నాకెంతమాత్రమును దురభిప్రాయము లేదని మరొక సారి ప్రమాణముగ మనవిఁ జేయుచున్నాను.

మఱొక్క మనవి. నాకేకోరికయు లేదు. నాకాభద్రాచలము జాగీరవసరము లేదు. మీఋణమును దీర్చిన యా శ్రీరామచంద్రునకే యాజాగీరు నర్పించి నన్నానందింపఁ గోరుచున్నాను. నామనవి నంగీకరింపుఁ"డని కోరెను. తానీషా గోపన్న యుదారహృదయమున కాశ్చర్యపడి, "గోపన్నా! నీయిష్టానుసారము నీవే యాభద్రాముడన కాజాగీరును నర్పింపుము. నీకిదివఱ కిచ్చిన జీతముకంటె ద్విగుణీకృతమగు మొత్తమును ప్రతిమాసము నుపకారవేతనముగాఁ బంపుచుండెదము.

అది యైన స్వీకరించి, నీయిష్టానుసార మాభద్రాచలరామ సాన్నిధ్యమునసే నీ శేషజీవితమును గడుపుకొనఁ గోరుచున్నాను. ఈ నాకోరికనైనఁ జెల్లింపు” మని బ్రతిమాలి గోపన్న నందుల కంగీకరింపఁజేసెను.

పిదపఁ దానీషా గోపన్నను సభామందిరమునకుఁ గొంపోయి తనయున్నతాసనము ప్రక్కనే కూర్చుండఁ బెట్టుకొనెను. గోపన్న కుపకారవేతన మిచ్చున ట్లాజ్ఞాపత్రమును దయారు చేయించి వెంటనే గోపన్నకు సమర్పించెను. పిదపఁ దానీషా లేచి సభాసదులతో గోపన్నను గూర్చియు, నతని సిపాక్కమ భక్తిని గూర్చియుఁ జాలవఱ కుపన్యసించి, “ఇంతటినుండి శ్రీ కబీరుదాసాజ్ఞానుసారము, నేనుకూడ ప్రజలందరిని గోపన్నను 'రామదాసు' అని పిలువఁ గోరుచున్నా”నని నుడివెను. సభ యంతయుఁ గరతాళధ్వనులతో నిండిపోయెను. “రామదాసుకి జై”యను జయధ్వానములు మిన్ను ముట్టెను. తిరిగి తానీషా రామదాసు నూరంతయుఁ దనప్రక్కఁ గూర్చుండఁ బెట్టుకొని మహావైభవముగ నూరేగించెను. అనేక దివ్యభవనములపై నుండి దారిపోడుగునను పుణ్యాంగనలు గోపన్నపైఁ బుష్పవర్ష మును గురిపించిరి. ఊరేగింపు ముగిసెను. తానీషా గోపన్న కనేక బహుమతు లొసంగి గౌరవించెను. “ప్రతిసంవత్సరమును భద్రాచలము వచ్చి శ్రీరాముని, నిన్నునుగూడ దర్శించుచుందు” నని వాగ్దానమును జేసెను. గోపన్నకడ సెలవుఁ గైకొనెను. గోపన్నయుఁ దానీషా ననేకవిధములఁ గొనియాడి యతని

కనేక కృతజ్ఞతావందనము లర్పించి, యతని ననేకవిధముల దీవించి సెలవుఁ గైకొనెను.

మఱునాఁడు శుభముహూర్తమున రామదాసు భార్యాపుత్రులతో - ఉచితపరివారముతో, అక్కన్న మాదన్నలకడ సెలవుఁ గైకొని వారు తనయెడలను, తన కుటుంబముయెడలను కష్టసమయమునఁ జూపిన యాదరాభిమానముల కనేకకృతజ్ఞతావందనము లర్పించి, వారి యాశీర్వాదములను బడసి, వార త్యంత ప్రేమపూర్వకముగ నొసంగిన బహుమతులఁ గైకొని శ్రీ భద్రాచలమునకుఁ బ్రయాణ మయ్యెను.

## 6. ఉపసంహారము

"బహుకాలమునకు శ్రీ - భద్రాచలేశునకుఁ
బాదసేవకుఁడనైతి - నహహా."

కతిపయదినములలో రామదాసు కుటుంబపరివార సహితముగ భద్రాద్రిని సమీపించుచుండెను. శ్రీభద్రశైల మాతని కంటఁబడగనే యాతని హృదయ ముప్పొంగిపోయెను. అతఁడు-

"కలియుగ వైకుంఠము - భద్రాచల - నిలయము
సేవింతము -
బంగారు గోపురములు కోవెలలు - వెలుంగు
మాణిక్యములు-
భేరీమృదంగాదినాదములు-భాగవతుల సంకీర్తనలు ॥కలి॥

అని గానముఁ జేయసాగెను. రామదాసు భద్రాచలము వచ్చుచున్నట్లు భద్రాచలము తాలూకాలోని ప్రజ లందఱకు

నదివఱకే తెలిసెను. అనేకవేల ప్రజలు భద్రాచలములో రామదాసు దర్శనమును జేసికొని ధన్యులగుటకై వేచియుండిరి.

ఆనాఁడు రామదాసుగారు వచ్చుచున్నట్లందరికిఁ దెలిసెను. భక్తకోటియును - పురప్రముఖులును - మంగళవాద్యములతో - రామభజనలతో - భూసురాశీర్వాదములతో - మంగళహారతులతో - రామదాసు నూరి వెలుపలనే యెదుర్కొని, యనేకవిధముల గౌరవించి, యతనిని సకుటుంబ పరివారముగ నూరేగించుచుఁ దిన్నగ శ్రీభద్రాచల దివ్య దేవాలయముకడ కరుదెంచిరి. ప్రజల జయజయధ్వానములు మిన్నుముట్టుచుండెను. భక్తులు తన్మయత్వముతో భజనలు చేయుచుండిరి. మంగళవాద్యములు వాయింపఁబడుచుండెను. దేవాలయమందు శ్రీరామచంద్రునకు నిత్యార్చన జరుగుచుండెను. భూసురుల వేదఘోష శ్రావ్యముగ వినవచ్చుచుండెను. రామదాసు హృదయ మానందడోలికలతో నూఁగిపోవుచుండెను. అతఁడు తన్మయత్వములో నొక్కుమ్మడిగ నొక్కపరుగున రామచంద్రుని గర్భాలయములోని కేగి యా రామదేవుని చరణములపైఁబడి—

"పాహి రామప్రభో! పాహి రామప్రభో!
పాహి భద్రాద్రి వైదేహి రామప్రభో!
శ్రీమన్మహాగుణస్తోమాభిరామ మీ
నామకీర్తనలు వర్ణింతు రామప్రభో!
సుందరాకార మన్మందిరోద్ధార సీ
తేందిరాసంయుతానంద రామప్రభో!
నామనోవీథిపైఁ బ్రేమతో నుండుమీ

భూమిజాసహిత జయ రామచంద్రప్రభో!
శ్యామలం సుందరం కోమలం జానకీ
కాముకత్వం భజే రామచంద్రప్రభో!
ఏటివాక్యంబు మీసాటిదైవంబు ము
మ్మాటికిని భువి లేదు మేటిరామప్రభో!
పుణ్యచారిత్ర లావణ్య తారుణ్య కా
రుణ్య గాంభీర్య శ్రీరామచంద్ర ప్రభో!"

యని యనేకవిధముల గానమును జేసి చేసి—

"గోవింద సుందరమోహనా
దీనమందారా గరుడవాహనా
భవబంధాది దుష్కర్మదాహన
భక్తవత్సల త్రైలోక్యపావనా ॥గో॥"

యని నృత్యముఁ జేయుచు భక్త్యావేశముతోఁ దన్మయుఁడై పోయెను.

కొంతవడి కాతఁడు ప్రకృతస్థుఁడై యానందబాష్పములు జాలువారుచుండ, భక్తులను గాంచి, వారిని దీవించి, శ్రీరామచంద్రుని నిత్యపూజార్చనానంతరము ప్రసాదమును గైకొని భార్యాపుత్రులతో, భక్తబృందముతో నిజనిలయముఁ జేరెను. ఆనాఁడే భద్రాచలము జాగీరును శ్రీభద్రాచల రామచంద్రున కర్పించి ధన్యుఁడయ్యెను.

అంతటనుండి రామదాసు తానీషాగారొసంగు నుప కారవేతనముతోఁ గాలముఁ గడుపుచు, పుత్రుఁడగు రఘురాము నకు సర్వవ్యవహారములను వప్పఁజెప్పి వైచి, తానును, దనసతీ మణియు శ్రీరామచంద్రభక్తులై - రామదాసులై - తుదకు జన్మాంతమున రామసాన్నిధ్యమును జేరిరి.

శ్రీరామదాసు ఆంధ్రభక్తులలో నగ్రగణ్యుఁడు! ఆంధ్ర దేశమందేగాక యావద్భారతదేశమందును రామదాసుకీర్తి నేటి వఱకును ధవళకాంతులతోఁ బ్రకాశించుచున్నది.

మంగళం.

"రామచంద్రాయ - జనకరాజజామనోహరాయ
మామకాభీష్టదాయ - మహితమంగళం ॥రా॥
కోసలేయాయ మంద - హాస దాసపోషణాయ
వాసవాదివినుత స - ద్వరద మంగళం ॥రా॥
చారుకుంకుమోపేత - చందనానుచర్చితాయ
హారకటకశోభితాయ - భూరిమంగళం ॥రా॥

* * * *

రామదాసమృదులహృదయ - తామరసనివాసాయ
స్వామిభద్రగిరివరాయ - సర్వమంగళం ॥రా॥"

శ్రీ శ్రీ శ్రీ

---

# 1. జ న న ము

"ప. రామభక్తిసామ్రాజ్య మేమానవులకబ్బెనో మనసా ॥రా॥
అ. ఆమానవుల సందర్శన మత్యంతబ్రహ్మానందమే. ॥రా॥"

*  *  *  *

భరతవర్షమున సంగీతము నాధ్యాత్మికవిద్యగా నెంచి సంగీతశాస్త్రోద్ధారకుఁడై, గాయకబ్రహ్మయై మోక్షప్రదమగు భక్తి నవలంబించి నిత్యమును గానలోలుఁడై భగవత్సంకీర్తన మొనర్చి తరించిన మహాభక్తాగ్రేసరుఁడు శ్రీత్యాగరాజు! త్యాగరాజు మహాభక్తుఁడేగాక సంగీతవిద్వాంసుఁడై, మహాకవియై యశోవిరాజితుఁ డయ్యెను. అతఁడు తనసంగీతశాస్త్రజ్ఞానమును మనోహరకవిత్వమునుగూడ భక్తితో మేళవించి భగవత్సంకీర్తన మొనర్చి బ్రహ్మానందపదవి నొందెను. త్యాగరాజు మంత్రపూరితములగు సప్తస్వరములతో మనోహరరాగముల నాలాపించి దివ్యగానము జేసి భగవంతుని గీర్తించెను. అట్లుఁ గీర్తించి, ఓంకారస్వరూపుఁడును, నాదబ్రహ్మమునగు పరమేశ్వరుని దివ్యమూర్తిని గాంచఁగల్గెను. అమరగానమును మించు తనగానముచే నానంద లోలుఁడగు లీలావినోదు నాకర్షించి తాండవింపఁజేసి తానును తాండవమాడెను. ఆబ్రహ్మానందముతో దన్మయుఁడై పోయెను. భగవంతుని జేరి తరించుటకు ముఖ్యమార్గము భక్తియనియును, స్థిరమైనభక్తి యల

వడుటకు సంగీతము ప్రధానమనియు, 'సంగీతజ్ఞానహీనులకు మోక్షము కలదా' యనియును, 'స్వరరాగ సుధా రసయుత భక్తి స్వర్గాపవర్గ' మనియును త్యాగరాజు బోధించెను.

అట్టి మహాభక్తుఁడును, సంగీత శాస్త్రోద్ధారకుఁడును, మహాకవియునగు త్యాగరాజు 1759 వ సంవత్సరములో జన్మించి 1847 వ సంవత్సరము వఱకును జీవించినట్లు చరిత్రాధారము వలనఁ దెలియుచున్నది.

త్యాగరాజు ఆంధ్రుఁడు. త్యాగరాజు తండ్రిపేరు రామబ్రహ్మము. త్యాగరాజు తాత గిరిరాజకవి. గిరిరాజకవి మురికినాటిశాఖకుఁ జెందిన సద్బ్రాహ్మణుఁడు. వీరియింటిపేరు కాకర్లవారు. వీరిది భారద్వాజసగోత్రము. ఈగిరిరాజకవి తంజావూరు నేలిన మహారాష్ట్ర రాజగు రెండవషాజీకాలమున రాజానుగ్రహము నను బడసి యాతని మన్ననల నందుచు, 'తిరువళ్యూరు' అను గ్రామమున నివసించుచుండెను. ఇతఁ డాంధ్రగీర్వాణ భాషల యం దసమాన పండితుఁడై యుండెను. ఇతని వంశీయులు నాయకరాజుల కాలముననే తంజావూరు రాష్ట్రమునకు వచ్చి యచట స్థిరపడినట్లు తెలియుచున్నది. గిరిరాజకవి సాంప్రదాయ కుటుంబీకుడును, సదాచారసంపన్నుఁడునై ఖ్యాతి నొందెను. ఇతని కైదుగురు పుత్రులు, అందుఁ గనిష్ఠుఁడే రామబ్రహ్మము. ఇతనిభార్య శాంతమ్మ. ఇతఁడుకూడ నాంధ్రగీర్వాణభాషల యం దసమానపాండిత్యము గలవాఁడు, భక్తిపరుఁడు. ఇతఁ డనేక వేదాంతకీర్తనల రచించి ప్రజలచే గౌరవింపఁబడుచుండు

వాఁడు ఇతని కిరువురు పుత్రు లుండిరి. అందు జ్యేష్ఠుని పేరు 'జ్యపేశను.' కనిష్ఠుని పేరు 'త్యాగరాజు'. రామబ్రహ్మము భక్తుఁడగుటచేఁ దిరువళ్ళూరులో వెలసిన శ్రీత్యాగరాజ స్వామి పేరు తన కనిష్ఠపుత్రున కిడి తృప్తిఁ జెందెను.

మరికొంతకాలమునకుఁ గుమారుల విద్యాభ్యాసమునకై రామబ్రహ్మము దిరువళ్ళూరును విడిచి, కావేరీతీరముననున్న 'తిరువయ్యూరు' అను నగరమును జేరెను. అచ్చట గొప్ప సంస్కృతపాఠశాల యుండెను. పూర్వమునుండియు నానగరము పంచనదమనియు, తపస్తీర్థ నగరమనియుఁ బేర్గాంచి యుండెను. తిరువయ్యూరు మహామహిమగల పుణ్యక్షేత్రము. ఆయూరిలో 'అల్కొండారు దేవుఁడు' వెలసెను. ఆ దేవునకు నిత్యమును ధూపము వేయఁబడుచుండును. ఆ నగరమున యముఁడు ప్రవేశింపకుండునట్లు పంచనదేశ్వరుఁడు కట్టడిచేసెనట! ఆ అల్కొండారు దేవుఁడు యముఁ డాపట్టణములోఁ బ్రవేశింపకుండ పంచనదేశ్వరు నాజ్ఞానుసారము కాపుఁ గాయుచుండునట! అట్టి పవిత్ర క్షేత్రమున త్యాగరాజు తన శైశవమును గడపెను. అందుచే త్యాగరాజున కా నగరమనిన నెంతయో ప్రీతి. అతఁడానగరమును, అందు వెలసిన పంచనదేశ్వర, ధర్మసంవర్ధినులను అనేక విధములఁ గీర్తించి యున్నాఁడు అతఁడు—

'క. శ్రీమత్పంచనదంబను
భూమిని విలసిల్లినట్టి పురవరమున శ్రీ

రామస్వరూపుఁ డనఁదగు
రామబ్రహ్మార్యసుతుఁడ రాగరహితుఁడన్॥'

అని చెప్పుకొనెను.

త్యాగరాజు తిరువయ్యూరు సంస్కృత పాఠశాలలో నాంధ్రగీర్వాణ భాషల నభ్యసించి పాండిత్యము నలవఱచు కొనెను. అప్పటికే ప్రఖ్యాతగాయకుఁడైన 'శొంఠి వెంకట రమణయ్య' అను సంగీత విద్వాంసునికడ సంగీతము నభ్య సించెను.

అంతటినుండి త్యాగరాజు క్రమక్రమముగా సంగీత జ్ఞానము నభివృద్ధిఁజేసికొని భగవంతునిపై భక్తిపూరితములగు ననేకకృతుల రచించి గానమును జేయుచుండువాఁడు. మాతృ పితృసేవాతత్పరుఁడై యుండువాఁడు.

మరికొంతకాలమునకు రామబ్రహ్మము తన యిరువురు కుమారులకును వివాహములు తలపెట్టెను. అందు త్యాగరాజు నకు, సత్కులసంజాతయు, సుగుణఖనియు, దైవభక్తితత్ప రయునగు, 'కమలాంబ' అను నొక కన్యారత్నమును వివాహ మొనర్చెను. వివాహములు చేసిన కొలదికాలమునకే రామ బ్రహ్మమును, శాంతమ్మయును స్వర్గస్థులైరి.

పిమ్మట దైవభక్తి తత్పరుఁడును, పితృభక్తిపరుఁడునగు త్యాగరాజు తన తండ్రిచే నిత్యము నారాధింపఁ బడుచుండెడి శ్రీసీతారామలక్ష్మణుల విగ్రహములను శ్రద్ధాభక్తులతోఁ బూజింపసాగెను.

త్యాగరాజు నిత్యము నా విగ్రహములతో నాడెడి లోకమని నిష్కామభక్తిపరుడై ప్రతిదినమును తనసహజగానమైపుణి మెఱయ ననేక రాగముల నాలాపించి స్వరచితకీర్తనలతో రామనామసంకీర్తనమును జేయుచుండువాడు.

హరికాంభోజి — రూపకము.

"ఉండేదే రాముఁ డొకడు - ఊరక చెడిపోకు మనసా ॥ఉం॥
చండమార్తాండమధ్య - మండలమునను చెలంగు ॥చం॥
తామసాదిగుణరహితుఁడు - ధర్మాత్ముఁడు సర్వసముఁడు
క్షేమకరుఁడు త్యాగరాజు - చిత్తహితుఁడు జగమునిండి ॥ఉం॥

అని వివిధగతుల గానమునుజేయుచు, భక్తితన్మయత్వముతో సొక్కుచు, బ్రహ్మానందరసతరంగితాత్ముఁ డగుచుఁ గాలముఁ బుచ్చుచుండెను.

# 2. ఉపదేశము

శ్లో॥ జగతివిశదమంత్రం । జానకీప్రాణమంత్రం
విబుధవినుతమంత్రం । విశ్వవిఖ్యాతమంత్రం
దశరథసుతమంత్రం । దైత్యసంహారమంత్రం
రఘుపతినిజమంత్రం । రామరామేతిమంత్రం.

ఆ నాటి కానాఁడు త్యాగరాజుభక్తి యతిశయించుచుండెను. త్యాగరాజు మహాభక్తుఁడనియు, సంగీతవిద్వాంసుఁ

డనియును, ప్రజ లాతని నత్యంతగౌరవముతోఁ జూడసాగిరి. ఆతనికీర్తి దేశమంతటను వ్యాపించుచుండెను.

త్యాగరాజుఖ్యాతిని విని యనేకభక్తులతని దర్శనమునకు వచ్చి యతని గానామృతమును గ్రోలుచు, బ్రహ్మానందము నొందుచుండిరి. కొందఱతనిశిష్యులై భగవచ్చరణ సేవతోఁ బాటు త్యాగరాజునుగూడ సేవించుచు ధన్యులగుచుండిరి. త్యాగరాజు నిత్యమును శ్రీరామసంకీర్తన మొనర్చుకొనుచు సంసారసాగరమునుండి తరింపజేసి మోక్షమార్గము నుపదేశించు సద్గురు వెవ్వరైన లభించునాయని తలపోయు చుండువాఁడు. అట్టి సద్గురువు లభించినచో నాతని నాశ్రయించి భక్తిశ్రద్ధలతో సేవించుట కభిలాషపడువాఁడు. ఈ విధముగనే త్యాగరాజున కానాఁటి కానాఁడు సద్గురుసందర్శనాభిలాష మెండగుచుం డెను. త్యాగరాజట్టి సద్గురు సందర్శనమునకై నిరీక్షించి యుండెను.

అట్లుండ నొక పుణ్యదినంబున త్యాగరాజు తన భక్త బృందముతో రామనామసంకీర్తన మొనర్చుచు నానందరసాబ్ధి నోలలాడుచుండఁ గాంచీపురమునుండి యొక మహాత్ముండు శ్రీరాముని గీర్తించుచు త్యాగరాజుసదనమున కరుదెంచెను. ఆ మహాత్ముని గానామృతము కర్ణపేయముగ వినఁబడ ధ్యాన నిమగ్నుఁడగు త్యాగరాజు కన్నులఁ దెఱచి యా మహాత్ముని గాంచి, భక్తిపూర్వకముగ నమస్కరించెను. ఆ మహాత్మున కర్ఘ్యపాద్యాదుల నొసంగి పూజించి, "మహాత్మా! నీ రాకచే

నీ దీనుని గృహము పావనమైనది. మీ దర్శనభాగ్యముచే నేను ధన్యుఁడ నైతిని. మోక్షమార్గ మెద్దియొన నుపదేశించి నన్నుఁ గృతార్థుని జేయ వేడుచున్నా" ననుచు త్యాగరా జా మహాత్ముని పదములపైఁ బడెను.

అంత నా మహాత్ముఁడును త్యాగరాజు భక్తి వినయాది సద్గుణంబులకు సంతసించి, "వత్సా! నీ యలౌకిక భక్తి తత్పరతయు, నీ దివ్య నామసంకీర్తనా విశేషమును విని నీవు ముందు భక్తాగ్రేసరుఁడవై శ్రీరామ సాయుజ్యము నొందఁగల్గు ధన్యాత్ముఁడ వగుదువని మెచ్చి, నీకు సంసారోత్తారమంత్రమును, జన్మసాఫల్యమంత్రమునగు శ్రీతారక మంత్రము నుపదేశింపఁ దలంచి వచ్చితి"నని యామహాత్ముండు త్యాగరాజునకుఁ దారక మంత్రము నుపదేశించి, దీవించి వెడలిపోయెను. త్యాగరాజామహాత్ముని యమృతోపదేశమును విని యానంద పులకిత గాత్రుఁడై యాతని యాజ్ఞానుసారము నిత్యమును శ్రీతారక మంత్రము బఠింపుచు నద్వితీయానందపరవశుఁ డగుచుండెను.

అట్లు త్యాగరాజామహాత్ముని యుపదేశాను సారము 96 కోట్లు సారులు శ్రీరామనామమును జపించునరికి శ్రీరామ చంద్రుఁడు త్యాగరాజునకుఁ బ్రత్యక్ష మయ్యెను. అంతట త్యాగరాజా దివ్యమంగళదర్శనమును గన్నులంగఱవుఁ దీఱఁ గాంచి బ్రహ్మానందభరితుఁడై భక్త్యావేశముతో—

సారంగ — దేశాది

"ఎంతభాగ్యము పాల గల్గితివి - ఎవ్వ రీమ
ముజ్జగములలోఁ దన ॥ కెంత॥
చింతఁజేరి సౌజన్యుఁడై పలికె - చింత బాగ
పాలగించి బ్రోచితివి ॥ఎం॥
సొగసుఁజూడఁ దరమా - నీ
నిగనిగమను సుకపోల - యుగము
చే మెఱయుమోము ॥సొ॥"

అని యనేకవిధముల శ్రీరాముని గీర్తించి తన్మయుఁడై తాండవ మాడెను.

మఱి కొంతకాలమున కొకసుదినంబున నారదమహా మునీంద్రుఁడు, వీణియ మేళవించి, శ్రీమన్నారాయణ సంకీర్తన మొనర్చుకొనుచు త్యాగరాజునకు దర్శనమిచ్చెను. త్యాగరా జతనిం గాంచి మహానందపరవశుఁడై, సాష్టాంగదండప్రణామం బాచరించి, యనేకవిధములఁ బూజించెను. నారదమునీంద్రుఁ డాతని భక్తివిశ్వాసముల కానందించి, తనశిష్యునిగా నంగీక రించి "స్వరార్ణవ" మనునొక సంగీతగ్రంథము నాతనికిఁ బ్రసా దించి, తద్గ్రంథరహస్యముల నెఱింగించి "సంగీతశాస్త్రోద్ధారకుఁ డవై సంగీతము ముక్తిఁ గాంచుటకు సులభసోపానమని లోక మునఁ బ్రకటించి ధన్యుఁడ వగు" మని దీవించి యదృశ్యుఁ డయ్యెను.

అప్పటినుండియు త్యాగరాజు నారదమహాముని యుపదేశానుసారము సంగీతజ్ఞానము నభివృద్ధిఁ జేసికొని, తన నిరుపమానగానకౌశలముతో రామనామసంకీర్తన మొనర్చుకొనుచుఁ దన్మయుఁ డగుచుండెను. త్యాగరాజు భగవచ్చింతనముఁ జేయుచుఁ దానను భవించు భక్తిభావోద్రేక జనితములగు ననుభవములనే తన సహజకవితాశక్తిచేఁ గీర్తనలరూపముగ గానముఁ జేయుచుండువాఁడు. ఆ కీర్తనలమూలమునఁ దా ననుభవించిన యానందమును బ్రజలచే ననుభవింపఁ జేయఁగలిగినాఁడు. ఇతఁడు దన యానందానుభవములను దేటఁదెల్లముగు తీయని తెలుఁగుభాషలో మనోహరశైలిని కీర్తనలరూపముగ విశదీకరించినాఁడు. ఇతఁడు రచించిన కృతు లన్నిటియందును భగవన్నామసంకీర్తనముఁ దప్ప మఱొండు గన్పట్టదు. ఇతఁడు "ప్రహ్లాదభక్తవిజయము" "నౌకాచరిత్రము" అను భక్తి ప్రబోధకములగు గ్రంథములనుగూడ రచించెను. వానిరచనావిధానము నూతనపద్ధతి ననుసరించియున్నది. ఆ గ్రంథములలో నాద్యంతమును భక్తిభావములే వెల్లివిరియుచుండును. ఇతఁడు తనయిష్టదేవతా ప్రార్థనలో శారదాదేవి నిట్లుఁ గీర్తించెను.

"క. వాణీ! నిను వేడెదను పు
రాణీ! నారసనయందు రంజిల్లవె క
ళ్యాణీ! వీణాపుస్తక
పాణీ! మాధుర్యవాణి! పద్మజురాణీ!"

"క. ఫణిలోచన! పల్లవ
పాణీ! యలినీలవేణీ! పావననుత గీ
ర్వాణీ! యనయము మ్రొక్కెద
వాణీ! నాజిహ్వాయందు వసియింపగదే!"

త్యాగరాజు కవిత్వముగూడ సహజకవియగు శ్రీ పోత రాజు కవిత్వమునుబోలి సహజభక్తిపూరితమై, రసవంతమై, మృదుమధురమగు శైలితో జాతీయములగు తెలుఁగు పదములతో నొప్పుచుండును.

## 3. జీవిత విధానము

"ప. శ్రీపతే! నీపద - చింతనే జీవనము
అ. నేపరదేశి నాగాసి బాపవే! చదువుచ దయఁజేసి ॥శ్రీ॥"

త్యాగరాజు వివాహమైన కొలఁది కాలమునకే యతని తలిదండ్రులు స్వర్గస్థులైరికదా!. అప్పటినుండియు నతని యన్నయగు జ్యపేశనుఁడును, అతనిభార్యయు నసూయాపరులై, గర్వభూయిష్ఠులై ప్రవర్తింపసాగిరి. త్యాగరాజును వారిరువురు ననేకవిధముల బాధింపసాగిరి. త్యాగరాజు నిత్యరామసంకీర్తనమును, దేవతారాధనమును వారికిఁ గిట్టలేదు. త్యాగరాజు వారుపెట్టు బాధల నన్నిఁటిని సహించుచు వినయవిధేయతలతోఁ ప్రవర్తించుచుండెను.

ఇంతలో త్యాగరాజుభార్య కమలాంబ కాపురమునకు వచ్చెను. ఆమె వచ్చినదాది జ్యపేశనుదంపతులు త్యాగరాజ

దంపతులను మఱింత బాధింపసాగిరి. అంతవఱకు వారికుటుం బము సమిష్టికుటుంబముగనే యుండెను. అంతటినుండి జ్యపేశను త్యాగరాజుతో వాదులాడి విభాగము కావలెనని తొందఱc జేసెను. త్యాగరా జందు కభ్యంతరపెట్టలేదు. విభాగములోc గూడ జ్యపేశను పెట్టుబాధలు భరింపలేక త్యాగరాజు యావ దాస్తియు నాతనికే వదలివైచి, తాను తన తండ్రినాcటి నుండియు నిత్యమును బూజించుచున్న శ్రీసీతారామలక్ష్మణుల విగ్రహములను మాత్రమే గైకొని సంతృప్తి నొందెను.

త్యాగరాజుభార్య దైవభక్తితత్పరురాలును, పతివ్రతా లలామయు నగుటచే వారిదాంపత్య మెంతయు ననుకూల మైనదై, సౌఖ్యప్రదమైనదై యుండెను. వారిరువురును నిత్య మును శ్రీరామచంద్రచరణసేవc జేసికొనుచు, రామనామసంకీ ర్తన మొనర్చుకొనుచు, పూజలొనర్చుచు, నైవేద్యము లర్పిం చుచు మంగళహారతు లొసంగుచు, చందనసేవలు, పవ్వళింపు సేవలును జేయుచుc బ్రొద్దుcబోవు వఱకును లాలిపాటలను, జోలపాటలను బాడుచు, తిరుగ వేకువనే లేచి మేలుకొలుపుc బాటలు పాడుచు నిట్లే శ్రీరామచంద్ర కైంకర్యముc జేసి కొనుచు సంతుష్టమనస్కులై కాలముc గడుపుచుండిరి.

కాని త్యాగరాజునకు జ్యపేశను దంపతుల బాధలు తప్పలేదు. వైరాగ్యభావపూరితులును, విశాలహృదయులు నగు త్యాగరాజదంపతు లాబాధలను పాటింపక నిశ్చలభక్తి పరులై యుండిరి. ఎన్నివిధముల బాధించినను త్యాగరాజదంప

తులు లెక్కపెట్టుట లేదని జ్యాపేశనుభార్యకు మిగులఁ గష్టముగ నుండెను. వారిపై నామె కక్ష వహించి యుండెను. జ్యాపేశను భార్యమాట కడుగు దాటలేనివాఁడు.

జ్యాపేశను పుత్రుఁడును, పుత్రికయును బాల్యమునుండియు త్యాగరాజదంపతులకడనే కూర్చుండుచు, వారి దేవతార్చనలను జూచుచు, వారి భక్తి రసామృతగానమును వినుచు, వారితోడనే కాలముఁ బుచ్చుచుండువారు. అది చూచి జ్యాపేశను భార్య సహింపలేక పోయెడిది. తనబిడ్డలను వారికడకుఁ బోవలదని యనేకవిధముల భయపెట్టుచుండెడిది. ఐనప్పటికిని త్యాగరాజు గానామృతము చెవులఁబడుసరి కాచిన్నబిడ్డల హృదయము లుప్పొంగి యొక్కపరుగునఁ దల్లి చూడకుండ నెట్లో వచ్చి త్యాగరాజుకడనే కూర్చుండువారు. జ్యాపేశను భార్య తనబిడ్డలచర్యఁ జూచి సహింపఁజాలక త్యాగరాజు తన బిడ్డలనుకూడ పాడుచేయుచున్నాఁడని భర్తతోఁ జెప్పి త్యాగరాజును దూషించుచుండెడిది. తనబిడ్డల నచటికిఁ బోవలదని యనేక విధముల దూషించి దండించుచుండెడిది. పాప మాబిడ్డలు కన్నీరు మున్నీరుగ నేడ్చుచు జాలికొల్పు ముఖములతో దూరమునుండియే త్యాగరాజదంపతులను, వారి పూజామందిరమును జూచి యానందించుచుండువారు.

విగ్రహాపహరణము

ఒకనాఁడు జ్యాపేశనుభార్య దుశ్చింతయై యొక పన్నుగడఁబన్నెను. తనభర్తతో త్యాగరాజదంపతులపై నెన్నో

కొండెములను జెప్పెను. ఇఁక వారున్న చోటఁ దాను గాపురముఁ జేయ లే ననెను. వారి భజనలసంకీర్తనముల గొడవ తప్పిపోవుట కొక్కటే యుపాయము కలదనియు నట్లు చేయఁ జాలనిచోఁ దానిఁక నచట నిలుఁవ జాలననియుఁ జెప్పెను. ఆమెకు సంతోష కరమగు పని యెద్దియైనను సరే చేయుటకు సంసిద్ధుఁడనై యున్నానని జ్యేష్ఠుఁ డనెను.

అంతట నామె తనభర్తతో "రహస్యముగ నీరాత్రి త్యాగరాజు పూజించు విగ్రహములను గొంపోయి కావేరీ నదిలోఁ బాఱవైచి వచ్చినచో నీ పీడ వదలు" నని చెప్పెను. జ్యేష్ఠ సందుల కంగీకరించెను. ఆ రాత్రి జ్యేష్ఠ నారవంత పనియు నతిరహస్యముగఁ జేసివైచెను.

తెల్లవారుజామున త్యాగరాజదంపతులు యథాప్రకారము మేలుకొలుపులు పాడుటకై లేచి శ్రీరామ విగ్రహములను గానక దుఃఖాతిరేకముతోఁ బడినపరితాప మింతింతని వచించుటకుఁ దరముకాదు. త్యాగరాజు సీతారామలక్ష్మణుల విగ్రహములు కాన్పింపనందున ననేకవిధముల విచారించి తుదకు శ్రీరామచంద్రునే తలఁచుకొని "రామభద్రా! నాపై నీకేల దయ తప్పిపోయినది? తండ్రీ! నీయెడ నే నెట్టియపచార మొనర్చితిని? ఒక్క నిముషమైన నీ వియోగము భరింపజాల. నన్నెట్లు విడిచిపోతివి. నే నెట్టిపరితాపమును భరింప గల్గుదును? ఇఁక నే నెవ్వారి నామసంకీర్తన మొనర్తును. ఎచ్చటనుంటివో చెప్పవా? తండ్రీ! నామొఱాలకింపవా! నన్ను రక్షింపవా? అనాధనాథా!

ఆర్తత్రాణపరాయణా! దీనచింతామణీ! భక్తరక్షామణీ! ”అని యనేకవిధముల దీనుఁడై పరితపింపసాగెను. అతఁడు నిద్రాహార ములు మాని తదేకదీక్షతో శ్రీరాముని బ్రార్థింపసాగెను. కొన్ని దినములకు త్యాగరాజునకుఁ దన సోదరుఁ డీవిగ్రహము లను గావేరీనదిలోఁ బడవైచినట్లు వదంతిగఁ దెలిసెను. అప్పు డైనను త్యాగరాజు తన సోదరునేమియు నిందించి యుండలేదు. అతఁడనేకసారులు కావేరీనదికిఁబోయి వెఱ్ఱివానివలె నా నదిలో విగ్రహములకొఱకు వెదకుచుండువాఁడు. కొన్నాళ్లకు శ్రీరా ముఁడు త్యాగరాజున కొకరాత్రి స్వప్నములోఁ బ్రత్యక్షమై కావేరీనదిలోఁ దానున్నస్థలమును జెప్పెను. ఆ వేకువజాముననే త్యాగరాజు కావేరీనదికడకుఁ బరువిడి పోవుచుండెను. అది చూచి యతనిభార్యయు, శిష్యకోటియు, భక్తబృందమును, అతనివెనుకనే త్వరత్వరగఁ బరుగిడిరి. త్యాగరాజు తిన్నగాఁ గావేరీనదీతీరమున కేఁగి యానదిలో దిగి శ్రీరామచంద్రుఁడు తనకుఁ జెప్పినస్థలమున వెదకసాగెను. అతని యదృష్టవశమున నావిగ్రహములచటనే యాతని యమృతహస్తములకు దొరకెను. అంతట త్యాగరాజు బ్రహ్మానందభరితుండై యా విగ్రహము లను దనశిరమున నిడికొని గంతులు వైచుచు తన్మయత్వముతో ననేక రాగవల్లరులతో రామనామ సంకీర్తన మొనర్చుచుఁ దాండవమాడెను. భక్తులందఱును, ప్రజ లందఱు నా యద్భు తమును గాంచి యాశ్చర్యపడి త్యాగరాజు భక్తాగ్రేసరుఁ డనియు, శ్రీరామచంద్ర ప్రియభక్తుఁడనియు ననేకవిధముల

గొనియాడిరి. అప్పటినుండియు త్యాగరాజుమహిమ ప్రజలంద ఱకును దెలిసెను. త్యాగరాజుకీర్తి మఱింత వ్యాపింపసాగెను.

ఆ హ్వా న ని రా క ర ణ ము

త్యాగరాజుకీర్తిని విని యప్పటి తంజావూరు మహా రాజగు 'శరభోజీ' తనపై నెద్దియైన నొకకృతిని రచింపు మని కోరుచు ననేక బహుమానములతో త్యాగరాజుకడకుఁ దన మంత్రి నొకనిని బంపెను. ఆమంత్రి త్యాగరాజును దర్శించి 'భక్తవర్యా! శరభోజీమహారాజుగారిపై నొకకృతిఁ దాము రచించినచో వారు తమకు విలువైన బహుమానములును, విశేషభూదానము నిచ్చుటకు సంసిద్ధులై యున్నారు. వారి సెలవైనదిగానఁ దాము తంజావూరు దయచేయ గోరుచున్నాను' అని నుడివెను. అంతట త్యాగరాజు చిఱునవ్వుతో "నిధి సుఖమా? రామునిసన్నిధిసేవ సుఖమా?" యని గానముఁ జేసి యామంత్రిని జూచి 'నాయనా! రాజ్యములును ఇహలోక సుఖములును అశాశ్వతములు! నేను ధనాశాపరుఁడను కాను. నాకు శ్రీరామచంద్రచరణసేవఁ దప్ప నన్యము రుచింపదు. అందుచేత ధనము నాశించి, శ్రీరామచంద్రుని గీర్తించిన యీ నాలుకతో నరస్తుతిఁ జేయఁ' నని చెప్పి యాతనిని బంపి వైచెను.

ఆసమాధానమును శరభోజీమహారాజు తనమంత్రివలన విని మిగులఁ గోపించి తక్షణమే త్యాగరాజును బంధించి తీసి

కాని రండని భటుల కాజ్ఞాపించెను. అదేమి చిత్రమోకాని యటు లాజ్ఞాపించినక్షణమే శరభోజీమహారాజు భరింపరాని శూలనొప్పితో బాధపడసాగెను. సంస్థానవైద్యులు, అనేకేతర వైద్యులును వచ్చి తమతమ యమూల్యౌషధముల నుపయోగించిరి. కాని ప్రయోజనము లేకపోయెను. మహారాజుబాధ యంతకంత కెక్కువ యగుచుండెను. భరింపరాని బాధతో నతఁడు కొట్టుకొనుచుండెను. వైద్యులు నిరాశఁ జెందిరి. అట్టి సమయమున శరభోజీ త్యాగరాజునెడఁ దా నొనర్చిన యప చారమే యీబాధకుఁ గారణమేమో నని యనుకొనెను. తత్ క్షణమే యతనిబాధ తగ్గసాగెను. అంతట శరభోజీ త్యాగరాజు మహిమ ననేకవిధములఁ గొనియాడుచు, నతని ఘనతను గ్రహించి, పశ్చాత్తప్త హృదయుఁడై స్వయముగ త్యాగ రాజును దర్శించి, తా నొనర్చిన యపరాధమును మన్నింపుఁడని యతని చరణములపై వ్రాలెను. త్యాగరాజు శరభోజీమహా రాజు నత్యంతవాత్సల్యముతో లేవనెత్తి, దీవించి పంపివై చెను.

మఱొక సమయమందు త్యాగరాజుశిష్యుఁడగు 'కన్నయ భాగవతులు' తిరువాన్కూరు మహారాజుగారిసభలోఁ దన గురువగు త్యాగరాజు మహిమను గొనియాడుచుఁ నాతనికీర్తన లను గొన్నిఁటిని శ్రవణానందముగఁ బాడి వినిపించెను.

తిరువాన్కూరు మహారాజగు తిరునాళ్ళుప్రభు వాకీర్తన లను విని యమితానందము నొంది, త్యాగరాజు గారిచేతనే యాకీర్తనలను బాడించి వినఁ గుతూహలుఁడయ్యెను. వెంటనే

తన యాస్థానగాయకుఁడగు 'వడివేలును' బిలిపించి త్యాగరాజు నాహ్వానించి తిరువాన్కూరుఁ గొనిరమ్మని పంపెను. వడివేలు బైలుదేరి తిరువయ్యారు చేరుసరికి శరభోజీమహారాజుగారి యాహ్వానమునే త్యాగరాజు నిరాకరించినసంగతి యాతనికిఁ దెలిసెను. అందుచేఁ దమ యాహ్వానమునుగూడ త్యాగరాజట్లే నిరాకరించునేమో నని వడివేలు, కొన్నిదినము లాలోచించుచు నాయూరనే వేచియుండెను. తుద కొకనాఁడు వడివేలు త్యాగరాజును దర్శించి, తన మహారాజు త్యాగరాజు నాహ్వానించినట్లును, తిరువాన్కూరు దయచేసినచో గొప్ప పదవి లభించుననియు త్యాగరాజుతో మనవిఁజేసెను. త్యాగరాజామాటలను విని వడివేలుతో సస్థిరములగు నిహలోకపదవులనుగాని, భూకనకవస్తువాహనములను గాని, రాజాశ్రయములనుగాని, తానాశించువాఁడను గా ననియు, శాశ్వతానందమగు నాధ్యాత్మికపదవినే యభిలషించియున్నవాఁడ ననియు జెప్పుచు—

కీ ర్త న.

"ప. పదవిని సద్భక్తియుఁ గల్గుట—
చదివి వేదశాస్త్రోపనిషత్తుల – సత్త తెలియలేనిదిపదవా?
ధనదారసుతాగారసంపదలు – ధరణీశులచెలి మొకపదవా?
త్యాగరాజనుతుఁడౌ శ్రీరాముని – తత్వము దెలియని
దొక పదవా?"

అని గానముఁ జేసెను. అంతట వడివేలు సిగ్గుపడి త్యాగరాజుకడ సెలవుఁ గైకొని వెడలిపోయెను.

త్యాగరాజట్లే తన యావజ్జీవమును శ్రీరామచంద్ర సేవా తత్పరుఁడై గడపెను. ఇతఁడు వారమున కొకసారి తనశిష్యబృంద ముతో వైలుదేరి రామనామసంకీర్తన మొనర్చుచు నానగర మంతయుఁ దిరుగువాఁడు. ఇతని గానామృతమును వినుటకై పుర జనులు కూడ తండోపతండములుగ నితనిని వెంబడించుచుండు వారు. అనేక గృహములనుండి పుణ్యాంగనలు త్యాగరాజుపై బుష్పవర్షమును గురిపించుచు, హారతుల నొసంగుచు, ననేకవిధ ములఁ బూజింపుచుఁ దోసెళ్ళతో బియ్యము మొదలగు నాహార ద్రవ్యముల నాతనిశిష్యకోటికి సమర్పించుచుండువారు. త్యాగరా జిట్లు భిక్షాటనముఁ జేసికొనుచుఁ దనకుటుంబమును శిష్యకోటిని బోషించుకొనుచు శ్రీరామభక్తిపరుఁడై తన జీవయాత్రను సాగించెను.

## 4. మతము - బోధనలు

"ఇతర దైవములవలన - ఇలనుసౌఖ్యమా రామ ॥ఇ॥
మతభేదము లేకసదా - మదినిమరులుగొన్న తన ॥క॥"

త్యాగరాజుకాలమునఁ బ్రజలస్థితియు, వారియాచారము లును మిగుల హీనదశలో నుండెను. ప్రజలలోఁ గొందఱు విష యలోలురై, డాంబికులై సంచరించుచుండిరి. ధనవంతులు స్వలా భపరాయణులై గర్వితులై యుండిరి. పామరులు జీవహింసా

పరులై, జారులై, చోరులై, జీవయాత్రను సాగించుచుండిరి. బ్రాహ్మణులుకూడ తమ మతనిబంధనల నతిక్రమించి, పతితులై పోవుచుండిరి. అప్పుడుకూడ బైరాగి వేషధారులగు కపట సన్యాసులుండిరి.

త్యాగరాజు గౌతమబుద్ధునివలెనే హింసాపూరితమును, పాపమయమునగు నీప్రపంచమును జూచి ఖేదపడెను. అతని మనస్సు ప్రపంచముపై విముఖత్వమును వహించెను. ఆవిముఖత్వమే తుదకు త్యాగరాజు దైవచింతనమునకుఁ గారణభూత మయ్యెను.

త్యాగరాజు గృహస్థధర్మ మాచరించుచునే పరమాత్మ నారాధించి, మోక్షమునొందవలెనను మతములోని వాఁడు. పరమేశ్వరుఁడు ప్రపంచమంతట నన్నిజీవులయందును, అన్ని వస్తువులయందును నిండియున్నప్పుడు, పరమేశ్వరు నారాధింపఁ దలఁచినవారీ ప్రపంచమున విసర్జింపఁదగిన దేది? అందుచే సంసారమందుండియే భగవంతు నారాధించి తరింపవచ్చును. అని త్యాగరాజు మతము. త్యాగరాజు కడు స్వతంత్రుఁడు. రాజులనైన లెక్క-జేయువాఁడు కాడు. ఇతఁడు భగవంతునికిఁ దప్ప మఱెవ్వరికిని తనగ్రంథములను గృతినిచ్చి యుండలేదు. ఇతనికి మతభేద మనినఁ గిట్టెడిదికాదు. అన్నిమతములసారము నొకటే యనియు,నన్ని మతములవారి లక్ష్యము నొకటేయనియు, భక్తిమార్గములు వేరైనను, మతసాంప్రదాయములు వేరైనను సర్వమతలక్ష్యమును పరమేశ్వరసాయుజ్యమును పొందుటేకనుక

మతభేదము పాటింపరాదని యతని యాశయము. ఇంతేగాక యితనికి దైవభేదముకూడ లేదు. అతఁడించుమించుగ నందఱు దైవములను శివకేశవభేదము పాటింపకఁ గీర్తించెను. కాని యితని యిష్టదైవము మాత్రము శ్రీరామచంద్రుఁడే!

త్యాగరాజు పెద్దలయెడ గౌరవభావముతోఁ నుండు వాఁడు. శాంతము, వినయము, గురుభక్తి, వైరాగ్యభావము మొదలగు సుగుణములు కలవాఁడు. నిత్యమును శ్రీరామచంద్ర చరణసేవఁ జేసికొనుచు నైవేద్యములు, మంగళహారతులు, ఉత్సవములు మొదలగునవి చేసికొనుచు, దేహధారణమునకు వలయునంత యల్పాహారమునే గైకొనుచు జీవయాత్ర గడుపు చుండువాఁడు.

అహంకారమును జంపుకొను మనియును, శాంతము లేనిదే సౌఖ్యము లేదనియును పెద్దలసుద్దులు విననగాని బుద్ధి రాదనియును, సంసారము చేయుచుండియే సర్వప్రపంచవ్యవ హారములపై విరక్తినొందుమనియు నితఁడు బోధించెను.

జీవహింసాపూరితములగు యజ్ఞయాగాదులు మోక్ష దాయకములు గావనియు, డాంబికముగ నొనర్చు జపతప స్స్నానాద్యనుష్ఠానంబులకంటె నిజమైన, నిష్కామమైన భక్తియే ముక్తిప్రద మనియు నితని విశ్వాసము.

జీవకోటిపై నిర్మలమైన ప్రేమయు, నిశ్చలమైన మన స్సును, నింద్రియనిగ్రహమును, వైరాగ్యభావమును, అచం చలభక్తియును, శాంతి వినయాది సుగుణంబులును, కలవాఁడే నిజమైన భక్తుఁడని త్యాగరాజు నుడివెను.

శ్రీరామానుగ్రహ బలము గలవానిని గ్రహబల మేమి చేయఁగల దనియు, రామభజనపరులకు దండపాణిభయము లేదనియు, రామకథాసుధారసపానమును మించిన యమూల్య వస్తువు మఱొకటి లేదనియు, నిష్కామభక్తితోఁ బరాత్పరు నారాధించవలెననియు నితఁడు బోధించెను.

త్యాగరా జిట్టి భావములను బ్రకటించుటచే నితఁడు కవి, గాయకుఁడు, భక్తుఁడు నగుటయేగాక మహావేదాంతి యని కూడఁ దెలియుచున్నది.

## 5. తీర్థయాత్రలు

"తెలిసి తియ్యగరాదా - తిరుపతివెంకటరమణ"

త్యాగరాజునకుఁ దీర్థయాత్రాభిలాష మెండుగ నుండెడిది. అతఁడు తనయూరికి సమీపముననున్న శ్రీరంగమున కనేకసారులు పోవుచుండువాఁడు. శ్రీరంగనాయకుని యుత్సవముల నన్నింటిని దర్శించుచుండువాఁడు. ఆ దేవునిపై ననేక కీర్తనలు రచించి, మహానందముతో గానముఁజేయుచు నా యుత్సవములతోఁ దిరుగుచుండువాఁడు.

దక్షిణదేశముననున్న పెక్కు పుణ్యక్షేత్రముల నీతఁడు దర్శించెను. ఆయాక్షేత్రములందు వెలసిన దేవతలపై ననేకకీర్తనలను రచించి గానమును జేసియుండెను. కాంచీపురమున కీతఁడు ప్రతిసంవత్సరము నేగి యా దేవునిపై ననేకకీర్తనలను

రచించి గానమును జేయుచుండువాడు. ఇతఁడట్లే కంచికామా క్షిని, మధుర మీనాక్షిని, నాగపురము నీలాయతాక్షిని, మధ్యార్జునక్షేత్రమందలి మహాలింగస్వామిని, ఇంక ననేక క్షేత్రములను, దేవతలను సందర్శించి భక్త్యావేశముతోఁ గీర్తించి యుండెను.

ఒకప్పు డితఁడు తిరుపతిలో వెలసిన శ్రీ వెంకటేశ్వర స్వామిని దర్శింపఁదలఁచి తన శిష్యబృందముతోఁ దిరుపతి కేగెను. తిరుమలపై వెలసిన శ్రీవెంకటేశ్వరునిపై ననేక కీర్తనలను రచించి గానముఁ జేయుచు నేడుకొండలను మహానందముతో నెక్కి యాతని దేవాలయమును దర్శించెను. ఆ దేవాలయమున శ్రీవెంకటేశ్వరుని విగ్రహ మగుపడకుండ నొక తెఱ యడ్డముగఁ గట్టిబడియుండెను. ఆ తెఱను తొలఁగించి శ్రీ వెంకటేశ్వర స్వామిని దర్శించుట కా దేవాలయపుఁ బూజారి యనుమతి కావలసి యుండెను. త్యాగరాజా సంగతి దెలిసికొని పూజా రిని సవినయముగఁ దా నెచ్చటనుండియో యా దేవుని దర్శించు టకై వచ్చితి ననియు, దయయుంచి, యా దివ్యమూర్తి నొక్క సారి కన్నులారఁ గాంచు భాగ్యముఁ గలుగఁజేసి పుణ్యముఁ గట్టుకొమ్మనియు, బ్రార్థించెను. కఠినచిత్తుఁడును, ధనాశాపరుఁడు నగు నాపూజారి త్యాగరాజుతో "స్వామి వారి దర్శనముకోరి నప్పుడెల్ల చూపుటకు వీలు లేదనియు, నాదినమున ధర్మదర్శ నము చూపువేళ దాటిపోయిన దనియుఁ బ్రత్యేకముగ దర్శ నము చేయవలసినచోఁ గొంతరుసుము చెల్లించవలయు"ననియు,

మొగమోటములేక నుడివెను. భిక్షాటనముజే జీవించు త్యాగ రాజేమిరుసుముం జెల్లింపగలఁడు? త్యాగరాజు పూజారి సమా ధానమును విని మిగులఁ జింతించి, తనపాపఫలమే యీ సమా ధానమునకుఁ గారణ మనుకొని, జాలిఁ గనుర శ్రీ వెంకటేశ్వ రునిగూర్చి "తెఱతీయగ రాదా! తిరుపతివెంకటరమణ" యని భక్తిపరవశుఁడై గానముఁ జేసెను. అతని యపూర్వగానమును వినుటకై యీదేవాలయమందలి జనులందఱును వచ్చి వీనుల విందుగ వినుచుండిరి. అర్చకులుకూడ యీ గానమును విను చుండిరి.

త్యాగరాజా తన్మయత్వముతోఁ దనతంబురను మీటుచు, గానముఁ జేయుచుండెను. ఇంతలో నాశ్చర్యకరముగ నడ్డ ముగ వ్రేలాడుచున్న యీ తెఱ దానంతట నదియే తొలఁగి పోయెను. అంతట త్యాగరాజు బ్రహ్మానందభరితుఁడై శ్రీవెంక టేశ్వరస్వామిని కన్నుల కఱవుఁదీఱఁ గాంచి యమితానంద ముతో ననేక కళ్యాణగీతములు పాడి, నృత్యముఁ జేసెను. ఈ వింతఁ జూచిన యశేషజనమును త్యాగరాజు మహిమను గొని యాడి యతనికి నమస్కరించి ధన్యులైరి. అర్చకులు త్యాగ రాజు పాదములపై వ్రాలి "మహాత్మా! నీ మహిమ దెలియక మే మొనర్చిన యపచారమును గరుణార్ద్రహృదయుఁడవై మన్నించువఱకును నీపాదములను విడువఁ జాల" మని ప్రార్థిం చిరి. త్యాగరాజు సహజకరుణతో వారిని లేవనెత్తి దీవించి "భక్తవరులారా! స్వామిదర్శనాపేక్షులై దేశదేశముల నుండి

వచ్చుచుండు యాత్రికుల కందఱకును స్వామిదర్శనలాభమును కలుగఁజేయుచుఁ గీర్తిగాంచు"డని దీవించి చనెను.

మఱొకప్పుడు త్యాగరాజు యాత్రల కేగి తిరిగి వచ్చునపుడు పూనమల్లి కనతిదూరములో నుండిన కొవ్వూరు వెడలెను. అప్పుడు ధనవంతుఁడును, గానవిద్యాప్రియుఁడును, భక్తుఁడునగు "సుందరముదలియారు" అను నతఁడు త్యాగరాజు మహాత్ముఁ డనియుఁ సంగీతవిద్వాంసుఁడనియు, భక్తాగ్రేసరుఁ డనియు విని యతనిని దర్శించి యాతనిపరిచయమును గలిగించుకొనెను. పిమ్మట త్యాగరాజును దన మందిరమునకుఁ గొనిపోయి కొన్నిదినము లుంచుకొనెను. సుందరముదలియారు కొన్నిదినము లట్లు త్యాగరాజు భక్త్యావేశముతో నొసఁగు గానామృతమును గ్రోలుచు, యనిర్వచనీయానందము ననుభవించుచు, నతని శిష్యుఁడై యతని ననేకవిధముల సేవించి, పరమభక్తుఁ డయ్యెను. అతఁడు త్యాగరాజు భిక్షాటనముచే జీవయాత్రఁ గడుపుచున్నట్లు విని యతఁడు భిక్షాటనమువలన జీవయాత్రకై మిగుల శ్రమపడుచున్నాడనుకొని యతని కావిచారము లేకుండఁ జేయఁ దలఁచుకొని, కొంత ధనసహాయమును జేయఁదలఁచెను. కాని త్యాగరాజేవిధమైన బహుమానములను స్వీకరింపఁడని యాతని శిష్యులవలనఁ దెలిసికొని మిగుల సంతాపపడెను. అప్పుడతఁడు త్యాగరాజునకుఁ దెలియకుండ శ్రీరామకైంకర్యమునకై త్యాగరాజుకుటుంబపోషణమునకై ఖర్చుపెట్టుఁడని త్యాగరాజు శిష్యులకు వారు వెడలిపోవునపుడు వేయిరూప్యం

బుల నొసంగెను. త్యాగరాజు వెడలిపోవు నపుడు సుందర ముద లియూ రాయన నొక పాలకిలోఁ గూర్చుండఁ జేసి యుచిత పరి వారము నొసంగి యతనిని బంపివైచెను.

ఆ దినములలోఁ బ్రయాణికు లనేక బాధలు పడుచుండు వారు. సరియైన మార్గ సౌకర్యము లుండెడివి కావు. నిర్జనస్థల ములనుండియు, నరణ్య మధ్యముల నుండియు బాట లుండెడివి. ఒకనాఁడు త్యాగరాజు శిష్యకోటితో, సుందర ముదలియారు తనతోఁ బంపిన స్వల్పపరివారముతో రామనామ సంకీర్తనమును జేసికొనుచు నిశ్చింతగఁ బ్రయాణము సాగించుచుండెను. పల్లకిని మోయువారు కూడ రామ నామమునే సంకీర్తనముఁ జేయు చుండిరి. అప్పటికిఁ జీఁకటి పడుచుండెను. శుద్ధవెన్నెలఁ గాయు చుండెను. వా రొక చిట్టడవి మధ్యనుండి పోవుచుండిరి. ఇంతలో వారి పాలకిపైనను, వారిపైనను చిన్నచిన్న రాళ్ళు పడసాగెను. ఆ రాళ్ళను దొంగలు వేయుచుండిరని వారు గ్రహించిరి. అంతలో దొంగలు వారిని ముట్టడించిరి. త్యాగరాజా దొంగ లను జూచి నిర్విచారముతో, "అయ్యా! మాకడ చిల్లిగవ్వ యైనను లేదు. వలసినచో నీ పాలకిని గైకొనుడు" అని చెప్పెను. కాని యా పాలకిలో నొక మూల త్యాగరాజునకుఁ దెలియకుండ నతని శిష్యులు సుందర ముదలియూ రిచ్చిన వేయి రూప్యములను దాచియుండిరి. అందుచేత శిష్యు లా సమయ మున త్యాగరాజున కాసంగతిఁ జెప్పకఁ దప్పనిసరియై నిజస్థితి నెఱింగించిరి. అంతట త్యాగరాజు శిష్యుల యవివేకమునకుఁ

జంతించి, దొంగలను పిలిచి, యా వేయి రూప్యంబులు గల మూటనుఁ శిష్యులచేఁ దెప్పించి, "ఇదిగో! గైకొనుడు. నాశిష్యు లవివేకముచే నొక ధనికుని కడ నీ వేయి రూప్యంబులును స్వీక రించి యీ పాలకీలో నాకుఁ దెలియకుండ దాచిరట! ఈ పాల కీనే మిమ్ములను గైకొనుఁడని నేననఁగా వారీసంగతి నాకిప్పుడు వెల్లడించినారు. నాకు ధనముతో నెంతమాత్రమును సంబంధము లేదు. కావున నీ పైకమును గొనిపొండు. మమ్ము యథాప్రకా రము సాగిపోనిండు" అని కోరెను.

అంతట నా దొంగల నాయకుఁడు ముందునకు వచ్చి త్యాగరాజునకు సాష్టాంగ నమస్కార మొనర్చి "మహాత్మా! మాకు మీ ధన మెంత మాత్రమును వలదు. మేము మా యవి వేకము వలనఁ దాము మహాత్ములని తెలియక మా చోరవృత్తి ననుసరించి యందఱివలెనే మిమ్ములఁ గూడ భావించి మీపై రాలను విసరి మిమ్ము బాధించితిమి. తమపై గూడ నేనొక రాయి విసరియుంటిని. అదేమి చిత్రమో కాని యారాయి తిరుగ నాకే తగిలి నా ముఖముపై గాయము పడినది. మరు క్షణము ననే సౌందర్య వంతులును, సుకుమార గాత్రులును, ఆయుధ పాణులునగు నిరువురు దివ్యమూర్తులు తమశిష్యులమని చెప్పుచు నా కగుపడి యదృశ్యులైరి. ఆ నిమిషమునుండియు నే నీ నీచ వృత్తిని మానివేయుదునని శపథమును జేసితిని. మీరు మహా నుభావు లని తెలిసికొంటిని. అజ్ఞానులమై మే మొనర్చిన యపరాధమును మన్నింప వేడుచున్నాను. తమ శిష్యుల

మని చెప్పి నాకగుపడి యదృశ్యులైన యీ మహాత్ము లెవరో తెలియజేయ వేఁడుచున్నా" నని సవినయముగ నడిగెను. త్యాగరాజానందాతిరేకమున నా పలుకులు విని "నాయనా! నీవు మహాదృష్టవంతుఁడవోయి! నీకు శ్రీరామలక్ష్మణుల దివ్య దర్శనమైనది. ఇంతటినుండి నీవు శ్రీరామనామసంకీర్తన మొన ర్చుచు రామభక్తుఁడవై తరింపు" మని దీవించి, రాముని లీలల కాశ్చర్యపడుచుఁ దన ప్రయాణమును సాగింపసాగెను. చోరులు కూడ కొంతవఱకు త్యాగరాజును సాగనంపి యతనికడ సెలవుఁ గైకొని వెడలిపోయిరి.

అట్లు వారు ప్రయాణమును జేయుచుండ నొకనాటి తెల్లవారుజామునకు వారొక చిఱుపల్లెను జేరుచుండిరి. ఆపల్లె యొక యరణ్యమునడుమనుండెను. అందువలన నాపల్లెలోని జను లా యరణ్యమునందలి ఘాతుకమృగముల బాధ పడలేకుండిరి. చీకటిపడినతోడనే యీ పల్లెలోని జను లిండ్లనుండి బైటికిరారు. సాయంకాలముననే యీ పల్లెలోని వీధులు నిర్మానుష్యముగ నుండును. అట్టితఱి నొక బ్రాహ్మణ పుంగవుఁడు భార్యాపుత్రు లతోఁ దీర్థయాత్రకై బైలుదేరి వచ్చుచుండ నాపల్లెఁ జేరుసరికిఁ జీకటిపడెను. అతఁ డాచీకటిలోఁ బ్రయాణమును జేయుట క్షేమకరము గాదని యీ రాత్రి కాపల్లెయందే గడపుట మంచి దనుకొనెను. ఆయూరిబైట నొకపురాతన దేవాలయముండెను. ఆ దేవాలయపుఁ దలుపులు లోపల బంధింపఁబడియుండెను. అందుచే నా బ్రాహ్మణుఁ డాదేవాలయపుఁ బ్రాకారమును దాటి

లోనఁ బ్రవేశించి తలుపులను దెఱచి భార్యాపుత్రులను లోనికిఁ గొనివచ్చి యా రాత్రి కచట గడుపఁదలఁచెను. ఆ యూహతో నతఁ డెత్తైనప్రాకారము నెట్లో దాఁటెను. అట్లు దాటి యా చీకటిలోఁ జెంతనేయున్న యొక నేల భావిని గానక ప్రమాద వశమున నందులోఁ బడిపోవుచు 'చచ్చితి' నని కేక వైచెను. ఆ కేక విని యతని భార్యాపుత్రులు హాహాకారము లొనర్చి యేడువసాగిరి. తెల తెలవారుచుండు సమయమున నాయేడ్పులు విని యాయూరిజను లందఱు నచటికిఁ జేరిరి. ఆ బ్రాహ్మణుని కళేబరమును బైకిఁదీసిరి. అతని భార్యాపుత్రు లా కళేబరముపైఁ బడి యేడ్చుచుండిరి. అట్టితరి త్యాగరాజు తన శిష్యపరివార ముతో నాదారి నేగుచు నా దృశ్యముఁ జూచెను. పరోపకార పారీణుఁడగు త్యాగరాజు వెంటనే యచటి కేగి యాపదోద్ధార కుఁడగు శ్రీరామచంద్రుని గూర్చి యనేకవిధములఁ దనసహజ గాన నైపుణి మెఱయ ధ్యాన నిమగ్నుఁడై ప్రార్థింపసాగెను. అతని గానరసామృతమును గ్రోలి యచట గుమిగూడియున్న జనులందఱును బ్రహ్మానందపరవశులైరి. త్యాగరాజు తదేక దీక్షతో భగవన్నామ సంకీర్తన మొనర్చుచుఁ దన్మయుఁడై యుండెను. కొంతసేపటి కాకళేబరము కదలెను. మఱికొంత సేపటి కా బ్రాహ్మణుఁడు కన్నులఁ దెఱచి చూచెను. తన యెదుటఁ దనకుఁ బ్రాణదానమును జేయుటకై వచ్చిన పరమే శ్వరుఁడా యనునట్లు గానముఁ జేయుచు నానందమూర్తియై యున్న త్యాగరాజు నా బ్రాహ్మణుఁడు విస్ఫారితనయనములతోఁ

జూచెను. త్యాగరాజు వెంటనే యాతనిని దన యమృత హస్తములతో లేవనెత్తి కూర్చుండ జేసెను. మఱికొంతవడి కా బ్రాహ్మణుడు సంపూర్ణారోగ్యవంతుడై త్యాగరాజున కనేక కృతజ్ఞతా వందనము లొనర్చి 'మహాత్మా! నాయెడ గల యవ్యాజానురాగముతో నా ప్రాణము లొసంగి రక్షించితివి. నీ యుపకృతి నే మఱువ జాలను. మహానుభావా! నీ గానామృతమును విని బ్రహ్మానందము నొందితిని. నన్ననుగ్రహించి యెద్దియైన ముక్తిసాధన మార్గము నుపదేశించి పుణ్యముం గట్టుకొనుమ'ని ప్రార్థించెను. ఆ బ్రాహ్మణుని భార్యాపుత్రు లమితానందము నొంది త్యాగరాజు చరణములు కన్నుల కద్దికొని యతనిచే దీవింపబడిరి. త్యాగరాజా బ్రాహ్మణునకి, యచటి జనులకును, రామనామ సంకీర్తనా మాహాత్మ్యము నెఱింగించి రామ భక్తులై తరింపుడని బోధించి తిరిగి తన ప్రయాణమును సాగించెను.

ఇట్లు డీ విధముగనే యనేక తీర్థయాత్రలను జేసి యనేక యద్భుత కార్యముల నొనర్చి యనేక జనులకు రామకథాసుధారస గానమొనర్చి వారి నానంద భరితుల నొనర్చి ప్రజలకు రామనామ మాహాత్మ్య మెఱింగించి, కొంత కాలమునకు స్వగ్రామముం జేరెను.

## 6. త్యాగరాజు కీర్తి

త్యాగరాజు ఖ్యాతిని విని యతని గానామృతము ననుభవించుటకై - యతని భక్తిభావము నవలంబించుటకై - యతని

కడ సంగీతము నభ్యసించుటకై - యతని యమృతమయా బోధ నలను వినుటకై - యతని దివ్యమూర్తిని జూచి యానందించుటకై - యతనిని బూజించుటకై దేశదేశములనుండి భక్తులు తండోపతండములుగ వచ్చుచుండెడివారు. ఒక్క భక్తులేకాదు. సంసారులు, సన్యాసులు, ధనవంతులు, నిరుపేదలు, పండితులు, పామరులు మొదలగు ననేకులు వచ్చుచుండెడివారు. త్యాగరాజు వారి నందఱను సమబుద్ధితోఁ జూచి యాదరించుచు, రామనామ మాహాత్మ్యమును బోధించుచుఁ దన యమృత గానముచే వారి నానంద భరితులఁ జేయుచుండెడివాఁడు. ఇతఁడు తన శత్రువులను మిత్రులకంటె నెక్కుడుగ గౌరవించువాఁడు. ఇతని కాలమున నుండిన భక్తులు, సంగీత విద్వాంసులు కూడ సమకాలికుఁడైనను త్యాగరాజు ఘనతను గ్రహించి గౌరవించుచుండువారు. ఇతని కీర్తనములను దేశమంతటను బాడుచుండెడివారు. ఇతని కీర్తి దేశమంతటను వ్యాపించిపోయెను. త్యాగరాజు కీర్తనములు సమస్త పురాణేతిహాసములునై యుండుటచే నితని కీర్తనములు త్యాగరాజోపనిషత్తులని పిలువఁబడుచుండెను.

ఈ విధముగ ననేకు లితని శిష్యులైరి. ఇతని శిష్యులలో 'తిరువత్తూరు వీణెకుప్పయ్య' 'వాలాజీపేట వెంకటరమణ భాగవతులు' 'అయ్యాభాగవతులు' 'గణేశయ్య' 'సుబ్బరామ భాగవతులు' 'సోజిసీతారామయ్య' 'తిల్లస్థానం రామయ్యంగారు' 'నేమం సుబ్బరామయ్య' 'ఉమయాపురం కృష్ణ భాగవతులు'

మొదలగువారు ముఖ్యులు. ఇతని శిష్యులలో ననేక సంగీత విద్యాప్రవీణులు — హరిదాసులు — భాగవతులు — భక్తులు — మొదలగువారుండిరి.

ఆనాటి కాలాఁడు త్యాగరాజు గొప్పతనము యావద్భారత దేశమునకును వెల్లడియై యాతనియనంతర మాతనికీర్తి మఱింత యతిశయించి, నేటికిని ధవళకాంతులతోఁ బ్రకాశించుచున్నది. నేటివఱకు ననేకచోట్ల నధికోత్సాహముతో — భక్తిశ్రద్ధలతో—త్యాగరాజోత్సవములు—త్యాగరాజ గానసభలు - త్యాగరాజ హరికథలును దేశమంతటను జరుగుచున్నవి. త్యాగరాజుశిష్యు లనేకులు తమకుమారులకు త్యాగరాజు నామ మిడికొనియున్నారు.

వేయేల! దేశమం దెచ్చటనో యొకచోట ననునిమిషమును త్యాగరాజు కీర్తనలు వినఁబడుచునే యుండును. ఆ గాన మాధుర్యము ననునిమిషమును గొంద ఱనుభవించుచునే యుందురు. త్యాగరాజు మహాధన్యాత్ముఁడు - సంగీతకళోద్ధారకుఁడు-మహాభక్తాగ్రేసరుఁడు-వేదాంతి-మహాకవియునై యశోవిరాజితుఁడయ్యెను.

# 7. చరమదశ

"భజనపరుల కేల దండ - పాణిభయము మనసా - రామ ॥భ॥"

త్యాగరాజు మహాభక్తుఁడై, కవియై, గాయకుఁడై, విరాగియై తన జీవయాత్రను నిశ్చింతగ గడిపినైచెను. నిత్య

శ్రీరామసంకీర్తనముఁ దప్ప నాతఁ డన్య మెఱుఁగడు. శ్రీరామచంద్రస్తుతిఁ దప్ప నరస్తుతిఁ జేసి యెఱుఁగడు. ధనధాన్యవస్తుచయమున కాతఁ డాశింపలేదు — రాజాశ్రయముల నపేక్షింపలేదు — రాజుల నాశ్రయింపలేదు — మహారాజులను సైతము లెక్కపెట్టక వారి యాహ్వానములను నిరాకరించి స్వేచ్ఛాజీవన మొనర్చిన స్వతంత్రుఁడు. ఆతనిజీవిత మాదర్శప్రాయమై, సర్వజనానందదాయకమై విరాజిల్లెను.

త్యాగరాజు రూపవర్ణనము ననేకు లనేక విధములుగ వర్ణించియున్నారు. కాని యతనివివిధచిత్రపటముల దిలకించిన నదో నొక విధమైనరూపము గోచరించుచున్నది.

అతఁడు కొంచెము కృశించిన దేహముగలవాఁడై, పొడగరియై, చామనచాయమేనివాఁ డనియును, భక్తి, శాంత వైరాగ్యభావములు సూచించు, విశాల ఫాలతలముగల నెమ్మోము గలవాఁడనియును, నుదుటఁ గోపీచందనపు నామముతో - చేతులఁ జిఱుతలతో - తంబూరతో - జపమాలతో - సాధారణ వస్త్రధారియై యుండువాఁడని తోఁచుచున్నది.

త్యాగరాజు భక్త్యావేశముతో హృదయము పొంగి గానముఁ జేయుచు రామనామసంకీర్తన మొనర్చునప్పుడొక్కొక్క సమయమం దాతనికి శ్రీరామచంద్రుని దివ్యదర్శన మగుచుండెడిది. అట్టితఱి త్యాగరాజు బ్రహ్మానందపరవశుఁడై నిశ్చల భక్తితో నొడలు మఱచి గానముఁ జేయుచుఁ దాండవ

మాడువాఁడు. ఒక్కొక్కప్పుడు నిమీలితనేత్రుఁడై, నిశ్చలుఁడై కొంతతడ వానందసమాధిలో నుండువాఁడు. ఈ లీలలన్నియును త్యాగరాజు భార్య యగు కమలాంబకును, త్యాగరాజు శిష్యకోటికిని, నిత్యానుభవములు.

కొంతకాలమునకు మహాత్ముఁడగు త్యాగరాజు తన యవసానకాల మాసన్న మగుచున్నట్లుఁ దెలిసికొనెను. అప్పటి నుండి యాతఁడు మఱింత నిశ్చలభక్తితోఁ బరమార్థచింతతో, శ్రీరామనామసంకీర్తన మొనర్చుకొనుచుఁ గాలము బుచ్చుచుండెను. త్యాగరాజు నిత్యమును శ్రీ భద్రాచలరామభక్తుఁడగు రామదాసునుకూడ తనగురువుగా భావించుచు, శ్రీభద్రాచలరామునికూడ 'గిరిపై నెలకొన్న రాముని — గురితప్పకఁ గంటి' మొదలుగాగల కీర్తనలతోఁ గీర్తించుచు నానందభరితుఁ డగు చుండువాఁడు.

ఇట్లుండ నొకనాఁడు శ్రీభద్రాచల రామచంద్రుఁడు త్యాగరాజునకుఁ బ్రత్యక్షమై "త్యాగరాజా! ఇఁక నీకుఁ బది దినములలో ముక్తిఁ గలుగు"నని నుడివె నట! ఆ పలుకు లమృతోపమానములై త్యాగరాజు కర్ణకుహరములలోఁ బ్రతిధ్వనింప నాతఁ డత్యంతానందపరవశుఁ డయ్యెను. శ్రీరామునకు నాపై నేఁటికి దయ కలిగినదికదా! యని సంతోషపడెను.

పదిదినములలో త్యాగరాజుగారు పరమపదము నలంకరింతురను వార్త యతిత్వరితముగా నూఱంతయుఁ బ్రాకి

పోయెను. ఇతర గ్రామములవారికిఁ గూడఁ జాలవఱకీ సం?
తెలిసెను. అంతటినుండి త్యాగరాజు శిష్యకోటియు — సా
భక్తులును—జనులును, అసంఖ్యాకులుగ త్యాగరాజును దరి
చుట్టకై౯ ప్రతిదినమును రాఁదొడగిరి. త్యాగరాజు పదిదిన
లును మహానందముతో — నిశ్చింతతో — తన్మయత్వముతో
శ్రీరామనామసంకీర్తన మొనర్చుకొనుచు, శ్రీరాముని దిv
మూర్తిని గాంచుచు నానందాబ్ధి నోలలాడుచుండెను.

పదియవదినమగు పరాభవ సంవత్సర పుష్య బహు
పంచమీ బుధవాసర మరుదెంచెను. ఆ నాఁడు త్యాగ
జత్యంతానందముతో వర్ణనాతీతమగు నానందరస ముప్పొం
నట్లనేక రాగవల్లరుల నాలాపించి యమృతగాన మొసర్చు
నొడలు మఱచి తాండవ మాడుచు, నానందసమాధినుండు
భక్త్యావేశముతో నూగిపోవుచు, ననేకవిధములఁ దన భక్తిప్ర
ర్శనములను, గానామృతమును ప్రేక్షకులచే ననుభవింపఁజేయ
చుండెను.

అతఁడట్లుఁ గొంతతడవు పాడిపాడి యానందసమాధిల
నున్నట్లు నిమీలితలోచనుఁడయ్యెను. శిష్యకోటి యది నిత్యప
నాతఁ డనుభవించు నానందసమాధి యనుకొనిరి. కాని వెంట
వారికి శ్రీత్యాగరాజస్వామి దివ్యతేజము పరంధామము
కేగుట కాన్పించెను.

భక్తబృందమును — శిష్యకోటియును — ప్రజాసమ
హము నాదివ్యదృశ్యముం గాంచి, త్యాగరాజు ననేకవిధము

ర్తించుచు, శ్రీరామనామసంకీర్తన మొనర్చుచు నాతనిభౌతిక శరీరము నూరేగించుచుఁ బవిత్రమగు కావేరీనదీతీరమునకుఁ గొనిపోయి యా పవిత్రక్షేత్రముననే యాతని కంత్యక్రియలను జేసి ధన్యులైరి.

త్యాగరాజు ఆంధ్రుఁడు — త్యాగరాజు సంగీతశాస్త్రోద్ధారకుఁడు — త్యాగరాజు మహాభక్తుఁడు — త్యాగరాజు మహాకవి — త్యాగరాజు మహావేదాంతి — త్యాగరాజు సంగీతమాధ్యాత్మికవిద్యయని నిరూపించిన మహాత్ముఁడు!

త్యాగరాజు కీర్తిచంద్రికలు భరతవర్ష మున్నంతకాలము దివ్యకాంతులతోఁ బ్రకాశింపఁ గలవు.

సామ—ఆది

"ప. శాంతము లేక — సౌఖ్యము లేదు
సారసదళనయనా ॥శాం॥

అ. దాంతులకైన — వేదాంతులకైన
చ. ఆగమశాస్త్రము — లన్నియుఁ జదివిన
బాగుగ సకల హృ — ద్భావము తెలిసిన ॥శాం॥
చ. యాగాదికర్మము — లన్నియుఁ జేసిన
భాగవతు లనుచు — బాగుగ పేరైన ॥శాం॥

* * * * *

శ్రీ శ్రీ శ్రీ